సీ॥ గవిసెనసడలించి ♦ కలికి కైనిడినక
డానిపీఠియఁగేలఁ ♦ బూనిపైడి
బొంగరంపుఁగవ ♦ బోనిగుబ్బలఁగుబ్బ
కాయలఁగదియించి ♦ కడఁకఁదీవె
పదుపుజక్కనొక్కనర్చి ♦ పఱువంపునెఱిఁగోళ్ళ
సుతిఁగొల్పి నాఁగాప ♦ గతిఁదనర్చి
సరిగమపధనిస ♦ సారములొలయ సెలు
గించు కెత్తిపలుకు ♦ సంచునరవ
తే॥ బలుకఁబలుకుల తేనియల్ ♦ జిలుకఁగలికి
కోయిలలుబల్కుఁగతి నెఱఁ ♦ గొమ్మవాఁడెఁ
మ్రోళ్ళునన లెత్తనీళ్ళు మొ ♦ గిళ్ళు హత్త
నోలినంచలుపరగఁజ ♦ ట్రాలుకరగ॥ 126

సీ॥ ఇట్లుపాడుచుఁగొంద ♦ ఱేణీదృశలత్తోడఁ
బంగారుపలకపైఁ ♦ బరచి సారె
"లెత్తినచో నెవ్వ ♦ రేనష్టమైనను
బంటకాయే నిజం ♦ పంగవలయు
నూ నాయమారయు ♦ చోమధ్యవర్తులే
మాటాడవలెనొడ్డు ♦ మాటలాడఁ
దగ" దనిచాటించి ♦ తరుణి! పందెము వేయు
మనిపురికొల్పిత ♦ ప్పాడఁగినిసి
తే॥ సారె కెఱుగించుచంతంత ♦ సారసాక్షి
నాగుమని తాను సారెల ♦ నలవరించి
ఒరులు గెలిచినచోఁద్రుళ్ళ ♦ కుండుఁడంచుఁ
బందెమును వేసెఁదారుని ♦ పట్టిపట్టి॥ 127

క॥ దుగదిగయు దిగయుదుగయుం
దిగతిగయుందచ్చిసతయుఁ ♦ దీవంచేని

త్రిగలాదిగాఁగగణితకుఁ
దగబాదెములువడెమదినిఁ ♦ దలఁచినకరణిన్ ॥ 128

క॥ అన్నిటిఁబంచఁగనిండీ
రన్నిఁటిఁబంచినవెనుకను ♦ నాడుఁడనుచు నా
కన్నియలఁగలిచెఁదారుని
కన్నియకన్నాకుమిన్న ♦ గానాడియహా! ॥ 129

ఉ॥ బిత్తఱియిత్తెఱంగుసర ♦ వింగరకౌశలమారనాడెఁదా
నత్తఱిచిత్తమందురహి ♦ నందఱునందరుదందఁగాణలుం
దత్తఱిలంగడెందములఁ ♦ దండిగహాయినిఁగోల్పుపాటచే
నత్తఱినర్కజుండు గడు ♦ హాయినిఁగాంచెఁ బలాశితోనహా! ॥ 130

సుగ్రీవుఁడు రుమాదేవిపాటవిని చెలికానితోఁ ముచ్చటించుట.

చ॥ పారినమృతంపుఁసోనలకుఁ ♦ బొందునుపీనులవిందుఁ బూవుఁద్రి
మ్మరితెవకమ్మమ్రోతలకుఁ ♦ మవ్వఁపుఁగోయిలకూతకుంబొరిం
బొరిఁగనఁగ్రందునైన స్వన ♦ మున్ విని బ్రహ్మముఁగన్నవానితో
పరిగముదమ్మునందిరవి ♦ జాతుఁడువల్కెను నేస్తకానితోన్ ॥

ఉ॥ మ్రోఁతయొకండు బిక్కటిలె ♦ మ్రోఁలనువింటివె మేటితేటిరా
మ్రోఁతయొవేల్పుటాండ్రడెలుఁగు ♦ మ్రోఁతయొకిన్నరకన్యవెల్గుమేల్
మ్రోతయొ గండుఁగోయిలల ♦ మ్రోతయొమాటమిటారివీణెబల్
మ్రోఁతయొనావయస్య! కర ♦ ముంబరమాద్భుతమయ్యెడుంబళీ!

ఉ॥ నావుడు "వాలితమ్మునకుఁ" ♦ నర్మసఖుండను దేవ!వల్లకీ
రావముపోల్కనేక్షితివ ♦ రప్రియకన్యకయో వనమ్మునం
గ్రావములుంగరంగఁమధు ♦ రమ్మగఁబాడెడు షడ్జశయ్యకా
క్రేవఁముదమ్మునంబ్రమద ♦ కేకిగణంబెలుఁగిచ్చెఁవింటివే॥ 133

చ॥ అనవినివేడ్కఁబల్కెఁడున ♦ హాస్కరనందనుడావయస్యతోఁ
బనివినినీవుతత్క్రియముఁ ♦ బాగుగనారసివచ్చితేని నే
బనివినికాంతుఁదత్తరుణి ♦ బ్రాయపుఁడెక్కనాతడంతఁవే
చనిచనిపూపొదల్దరుల ♦ జక్కనొకానొకచోటనీటుమై॥ 134

ఉ॥ ఒక్కరసాలసాలమున • కోరఁశరీరముఁగుంచిపొంచి తాఁ
జక్కఁగఁగాంచెఁ జక్రసదృ • శస్తనిఁజారుసరోజలోచనం
జక్కెరవింటిజోదనుఁగుఁ • జక్కెరబొమ్మయొడల్ పొలయ్యఁగడుం
జక్కఁగఁగన్నదానిఁగడు • చక్కనిదానిని మోహనాంగినిన్ ॥ 135

నర్మసఖుండు రుమాదేవిచక్కఁదనంబు సుగ్రీవున కెఱిఁగించుట.

చ॥ కనివినిదానిసోయఁగపు • గల్మినిఁ బాట ఘొయూరమాటలోఁ
గనివినితప్పఁగన్వారవు • గంటికినింపగు డబ్బరంబుత్రోఁ
బనివినిరాజుఁదెచ్చి యిటఁ • బైఁదలికిందగులమ్మునత్తనం
చనివినుపూవుటమ్ముజోటి • కయ్యది తెల్పఁగ నేగె నాతఁడున్ ॥ 136

మ॥ చనిసుగ్రీవునిఁగాంచిదేవ! పెనుకా • సారావళుల్ నాక జ
క్కని పూదేనియకాల్వలంచనక జో • క్కంపుంబొదల్ నాక జి
క్కని క్రొమ్మావులునాక వేచనిపొడం • గంటెంగురంగాక్షిఁ బ్ర
క్కనిలింపాంగనలోయనం జెలులు జ • క్కంగొల్వవీణాంగరం
బనివార్యంబుగ మీటుచాటగోన జే • పారంగఁజూపన్నువన్ ॥

క॥ నరవరకన్యలనలకి న్నరవరకన్యలబలారి • నారులదర్వీ
కరవరకన్యలనలఘే చరవరకన్యలఁగలారె • సకిఁబోలుసకున్ ॥ 138

చ॥ మృదుగతిఁ గ్రొమ్మెఱుంగుజిగిఁ • మేటిజమేటసటంబసందుగాఁ
మెదిపి ప్రతాపఁపుర్ శిఖిని • మెట్టి బుటంబును దమ్మిదిమ్మనాఁ
జదరఁపుఁదాకటం దిటవు • సమ్మెటఁగెమ్మి మరుండుసన్నతో
నెదిరిచి నేర్పుమైఁగలికిఁ • సృష్టియొనర్పఁగఁబోలుఁబోసఖా! ॥ 139

తే॥ మొగము సర్వమ్ముఘననేత్ర • యుగము పేరు
టురముసర్వమ్ము నవపయో • ధరములసదు
గవునుసర్వమ్ముగ గనమ్ము • నవుననంగ
నబలసొబగువశమ్మా నె • యభినుతింప 140

సీ॥ చివురులు మఱిపండ్లు • జిన్నితావేళ్ళు జు
క్కలు దుత్తారలు నసం • టులును నిసుము

తిన్నెలు నల్లత్రాచుఁ • దిట్టలు సుళ్ళు ద
రగలు బంగరుబొంగ • రాలు జంద
మలతూండ్లు బెసరగా • యలు దాటిగింజయుఁ
దొండపండులు జిల్క • తుటుముమల్లె
మొగ్గలు నూనసల్ • ముత్తెంపుజిప్పలు
విండ్లు శ్రీలద్దాలు • విరిదిరుగుడు॥
తే॥ బాఱు లఱనెల నీలంపుఁ • బాఱులుదుటు
దనఁపుఁగ్రొక్కారుగఱినీరు • ద్రావుడులు నె
లంతయుంగకములకింత • కాంతినోసఁగ
లేకపోనిదానికి నొడల్ • జిగినొసంగు॥ 141

సీ॥ ఇంద్రనాగమ్ము నా • గేంద్రమ్ముఁనిందించుఁ
గతిమెప్పు కప్పునూ • గారుచొప్పు
నబ్జరాజివిరాజితా • బ్జమ్ముఁ హసియించుఁ
గందోయిపెంపు మొ • గమ్ముసొంపు
కీరవాణినివాణి • కీరమ్ము నెగ్గించుఁ
గుల్కుఁబల్కులతీరు • గొమ్మసొరు
మృగరాజమునురాజ • మృగమునునదలించుఁ
గవునుమేల్తళ్కుప్రే • క్షణఁపుఁబెళ్కు
తే॥ జక్రతుల్యతఁబరగును • చంబులందుఁ
దుల్యచక్రతబరగునె • త్తుంబిఱుందు
నమరనారోహణావరో • హణములందుఁ
జానసాబగెన్నఁగనయ్యె • జగమునందు॥ 142

క॥ చక్రములునితంబాబులుచక్రములుపయోజగంధి • చారుకుచంబుల్
చక్రయుగమ్ములుకరములు చక్రధరునకైనఁదాని • శక్యమె పొగడన్॥
ఉ॥ తామరవిందుకంద! కను • దామరలుండుటకున్ ఫలంబుగా
దామరకంటిఁగంటిదగు • దామరకంటియుఁనీకుఁ నీవునా

తామరకంటికిందగుదు ♦ తామరకంటిని నిన్ను గూర్పునా
తామరకంటివానిదిక ♦ దామర యేమనిపల్కెదుం బళీ! ॥ 144

చ॥ అనవినిమిత్రపుత్రుఁడెద ♦ నంతమెఱుంగని యుబ్బుమోహముం
గని వనితామణింగనులఁ ♦ గన్గొనను వ్విళులూరుచున్ రయం
బునఁ దనపొందుకానిఁ దెరు ♦ వుంగనిపింపుమటంచు నాతఁడ
వ్వనిఁదనముందుఁద్రోవను జ ♦ వమ్మునఁగన్బరుపంగఁదాఁజనెన్ ॥

శా॥ పూవుందేనియకాల్వలీయవియ పూ ♦ వుందీవెపందిళ్ళఁ గ్రొం
బూవుం జప్పరఁపున్ బిడారులివియా ♦ పుప్పొళ్లఁజవ్వాజి నె
త్తావుల్ గుప్పివి కస్తురియ్యదిటుబోఁ ♦ దాకల్ గడున్మెందు నీ
త్రోవల్ కావల మల్లెపూఁబొదదరిం ♦ ద్రోవొందుగల్దట్టుపొన్ ॥

చ॥ సుఖపుగనేగవచ్చు నల ♦ సుందరికేళి విహారవేళలం
గిలుకుటెలుంగునంబలుకఁ ♦ గెవ్వననార్చుచు వచ్చుకో! వెలల్
చిలుకలతావుమావులవె ♦ చేడియ పూబొదరిల్లునల్లదే
చెలువపుటన్నుమన్కియిదె ♦ చెప్పెడిదేమదె పూవుఁబోఁడియున్ ॥

సుగ్రీవుఁడు నర్మసఖునితోఁవచ్చి రుమఁగాంచుట

చ॥ అనిచనువొప్పఁ నర్మసఖు ♦ డాడుటకున్మను కల్కిమన్కిపై
నుచిన పైడిపంటికవ ♦ యున్ మణిరత్నపుఁ దోరణాదులుం
గని చినరాయఁడాత్మనిది ♦ కాదగుమంగళసూచకంబటం
చనిచనునవ్వలన్ ఘనులు ♦ నారయుచుంద్రుసులక్షణమ్ములన్ ॥148

వ. అంతఁదదీయమార్గంబున నేతెంచుచుఁ నర్మసఖుండు, రాజసుందరులున్నయెడ, కథిపులేతేరఁవారు నాటితేటిన ప్రోషలుఁగాని కతమ్మున జంకుదురను శంక సంకించి పలుకుటయుఁ సుగ్రీవుఁడక్కంబుగ్రీవలకుఁ గనుచాటుగఁ గుఱంగట నొక్కచక్కనిపోకమ్రాకున కోరగాఁ జెలికాని కేలూని హొయలుమీరఁగాఁ బొంచి నిలుచుండి

సీ॥ పట్టుతైకఁబగిల్చి ♦ పైడివల్వానదల్చి
మెఱుగు గుబ్బలడంబు ♦ మిట్టిపడఁగఁ

బావడాయించి పైఁ • బన్ను చేలంబొంచి
పసువంపుఁబోడలడాల్ • బైటవడఁగఁ
లాల్ తూరి • చెక్కుటద్దాల మీరి
పైడికమ్మలతళ్కు • బన్వలిడఁగఁ
దలకట్టు నెడబాసి • మొలపట్టుఁబడఁద్రోసి
పెన్నెఱుల్ పిఱుఁదులఁ • బేఱమిడఁగఁ॥
తే॥ గాఁగరాకుచ్చెలల్ కాళ్లఁ • గంతులిడఁగ
నెలుఁగుకిన్నెర పాటలోఁ • నిమిడిమడఁగఁ
మెలఁతగమిలోనఁ గిన్నెరఁ • మీటుచుడుగ
కాత్మకింపగురుమఁగనె • నతఁడుగడుగ॥ 150

రుమాదేవి సుగ్రీవుఁజూచుట

తే॥ అంతఁ శశికాంత వేదికా • భ్యంతరమున
నంతమెఱుగని కౌతుక • స్వాంతయైన
కాంతలంగూడి యారుమా • కాంత వెడ్కఁ
దఁత్రిఁగొనగోటమీటుచఁ • వింతతో ప॥ 151
సీ॥ ఎలజవ్వనమువాని • నెలచందు వలకందు
దలపందుఁదెగడు నం • దంబువానిఁ
జఱునవ్వులరువానిఁ • జెందమ్మి లందమ్మి
లందొమ్మిఁగొనుకన్ను • లంగలానిఁ
బరువమ్ముఁగలవానిఁ • బంగారు రంగారు
కంగారు చేలఁమై • గప్పువానిఁ
విలునమ్ములుఁగలానిఁ • విప్పారు చొప్పారు
గొప్పపేరురముతో • నొప్పువానిఁ॥
తే॥ వలపుఁగస్తురినామమ్ము • పొలుపువానిఁ
బిన్నవయసుం జెలులవల • పించువానిఁ
గూర్మిబుఱుకువిరజుసన్నుఁ • గుఱ్ఱవాని
గాంచెఁ గనులారఁ జెలినూతఁ • గన్నవాని

ఉ॥ చూచి భయాద్భుతమ్ములు వి • జృంభణగ వెన్కకుముందులాగఁగాఁ
లేచి స్వపాదపద్మయుగ • శ్రీమణినూపుర రావ మొప్పఁగాఁ
ద్రోచి నెలంతలం గలికి • త్రొంగలి రెప్పలనోరగాంచుచుం
బూచినయొక్క పోతనును • బోడియమాటున కేగె నంతలోన్॥

సుగ్రీవునకుఁ రుమ చెలులు మర్యాదలు సేసి వారి శాకకుఁ

గారణమడుంగుట

ఉ॥ నెచ్చెలి పింఛమిందుకొని • నెచ్చెలితోఁ జనుదెంచినట్టియా
పచ్చగురాలరాయనుఁగు • బట్టికి మ్రొక్కి సభక్తిగూర్చునం
బచ్చలగద్దె బెట్టి చెలిఁ • బ్రక్కనఁ గూర్చొనఁ జేసి దప్పికల్
బుచ్చ ననంటిదొన్నియలఁ • బువ్వుల దేనియ లిచ్చి మెచ్చఁగాన్॥

ఉ॥ తీయనిపండ్లు జక్కెరకుఁ • దీయనివానిని దెచ్చి పుచ్చి కొం
డీయని వేడ్క నిచ్చి తిను • డీయనఁ వారలు వానిఁ మెక్కి యా
తీయని తేనె ద్రావి వెను • దీయని ప్రేమలనుండఁ గాంచి రం
డీయని జోంట్లఁ బిల్చి విను • డీయసయోర్తు కవల్కు వారితోన్ 155

ఉ॥ ఎక్కడి వారలో తమరు • నిందుని గందుని నెన్ను నీఘనుం
డెక్కడివాడొ మీరిటకు • నెక్కడినుండియు వచ్చినారొ మా
కెక్కడివారికిం దెలియ • నింపుగఁ బల్కుడటన్న వేడ్కమై
నక్కడివారి జూఋలకు • నర్కజు నెచ్చెలి వల్కెఁ నేర్పునన్॥ 156

క॥ అజనందనుఁడగు బుుషివి
రజనందనులఁ గడవాఁడ • రణ్యమునఁ గిరా
టజనమ్ముతోడఁ జని మో
దజనకముగఁ వేటఁ జలిపి • తానిటు వచ్చెన్ 157

క॥ వచ్చితదీయోద్యానముఁ జొచ్చి చరింపుచుఁ వనమ్ము • సొంపరి మెలిలో
హెచ్చఁగఁ గన్గొనుచునుసీ వచ్చని గుజ్జాల్ వజీరు • పట్టియు నెంతేన్॥

తే॥ పద్మినీజాతిభామలఁ • బాళిఁ గాంచు
నాతఁడౌటమీ పద్మినీ • జాతినాతి

గాంచవచ్చెనీకంజాక్షి • గన్న జేని
పేరు నీమెపేరుంబల్కు • డీరుదమిని॥ 159

ఉత్సాహము. నావుడిట్లువల్కఁబద్మ • నయన మిత్రపుత్ర సు
గ్రీవునే_స్తకానిఁగూర్చి • ప్రీతిపూర్వకమ్ముగాఁ
దేవ! శంభరీసమాఖ్యఁ • దేజరిల్లునీటుమై
శ్రీవరాంగికిల్లనంగఁ • జెల్లుపురవరంబిటన్॥ 160

ఉత్సాహము తారుఁడనుమహీవరుండు • దానినేలు నామహా
దారుఁడలరఁగాంచెనీ సు • ధాకరాననన్మహా
తారకేశకీర్తిరిపు వి • దారణుండు వార్ధిగం
భీరుఁడకలుషుండు నిండు • బేర్మిమీరనెంతయున్॥ 161

వ॥ అనియిట్లు సుగ్రీవునుద్దేశించి 162

నేఁడుగదాలభించెఁ దరు • ణీమదనా! మిముఁగాంచుభాగ్యముల్
నేఁడుగదా సుధీవినుత! • నీవిటరాఁసమకూడెనన్నియున్
నేఁడుగదానశించెనెఱి • నీనునుజూడ్కులను_త్తమచ్ఛటల్
నేఁడుగదామదీయ తరు • ణీమణికోర్కిఫలించెమేల్ భళీ!॥ 163

సీ॥ మృగవిలోచనరుమా • వృత్తాంతమీరీతిఁ
వినుపింపఁరవిజుండు • వేడ్కగాంచె
నావెన్కమదనుండు • నలరుటమ్ములఁరుమా
సుగ్రీవులమనమ్ము • గ్రుచ్చఁజేసె
నాపైనిసుగ్రీవు • నాలోకనమురుమ
పైనామెచూపర్కి • పైఁజెలంగ
నామీదనాయిర్వు • గాత్మలమోహంపుఁ
వెల్లిపాల్వెల్లినాఁ • విరివిబొంగ
తే॥ నంతలోఁశంభరిపురీశు • కాంతబిల్చెఁ
గాంత! రారమ్మటంచొక్క • కాంతచీరఁ
స్వాంతముప్పొంగనారుమా • కాంత వ్రామెఁ
దల్లికడకును సుదతీమ • తల్లికడకు॥ 164

చెలులు సుగ్రీవునాజ్ఞఁ గైకొని తమదేవితో నింటి కేగుట.

చ॥ ఇటు జెలి వ్రాలుచుండఁ దరు ♦ ణీ! కరుణానిధి యర్కసూతి ప
ల్కిటు జెలువారఁ గైకొనక ♦ యేచనఁ జెల్లునె యంచు నెచ్చెలుల్
తటుకునఁ గాంతఁ దెల్పి నృప ♦ తల్లజ! మా చెలిమీఁది ప్రేమ మీ
పటుతరమానసాబ్జమునఁ ♦ బాయక నిల్పుమటంచు యామినీ
విటుసమవక్త్రిఁ గొంచుఁ గడు ♦ వేడుకతోడను బోయి రాదటన్

ఉ॥ కాంతనివాసభూములను ♦ గన్గొనుచున్ ఘనమోహవార్ధిలో
నెంతయుఁ దేలుచున్ సచివు ♦ డేయెడఁ దోడుగఁ గూడ రాఁగఁ గ
ర్ణాంతవిలోలలోచనకు ♦ నైయటు దేపకుఁ జూచుచున్ వివ
స్వంతకుమారుఁ డేగెఁ నిజ ♦ పట్టణమార్గమునం బురమ్ముకై ॥ 166

పంచచామరము రమాకుమారి వోవుచట్లు ♦ బ్రొద్దుపట్టికయ్యెఁ నా
త్మమాటిమాటికిన్ విరాళి ♦ ధైర్యమెల్లఁ జాఱన
క్కుమారురూపరేఖ యాత్మ ♦ కున్ముదమ్ముఁ గొల్పనా
హిమాంశువక్త్రి వెన్కఁ జూచు ♦ చిమ్ముఁ జేరెనంతలోన్

సూర్యాస్తమయవర్ణనము.

క॥ తనయునికి కేగెఁ నెచ్చెలి తనయునికినుకఁ విరహాబ్ధిఁ ♦ దాఁ ద్రోసియిదే
యనికినుకసూనెనో యనఁ దినమాణిక్యముకషాయ ♦ దీక్షితిఁ గాంచెన్ ॥

తే॥ వరుణదిక్కామినీమణి ♦ వంట సేయఁ
వార్ధికూపమ్ములో నీటి ♦ నర్ధిఁ దీయఁ
సాంధ్యరాగరజ్జువుఁ గట్టి ♦ జాఱవిడిన
హొన్నుబిందెనాఁ వార్ధిఁ సూ ♦ ర్యుండు గ్రుంకె ॥ 169

తే॥ మదనునిప్రతాపశిఖిశిఖా ♦ మండలంబొ
వనరమాదేవి కెంపుదు ♦ వ్వలువ డంబొ
మునికులంపు రక్తశాటీస ♦ ముదయకాంతిఁ
యోయనఁగఁ సాంధ్యరాగంబు ♦ నొప్పియుండె॥ 170

క॥ మందోష్ణతఁగ నెదమ్ములఁ విందుంగలుగొరలుపక్షి ♦ వితతులు గగన
మ్మందుఁ బఱతెంచె నిద్దుర జెందెం దమ్మి మృగతృష్ణ ♦ జీర్ణంబయ్యెన్ ॥

తమచ్ఛటాభివర్ణనము.

సీ॥ నల్లత్రాచుం బేర్ల • నుల్లసిల్లెడుశంభు
గప్పుఁగుత్తుకసొంపుఁ • గాంచిపోరి
కమ్మనికస్తూరిఁ • నెమ్మేననలఁదిన
మాయబోయతమేని • చాయఁగేరి
నెమ్మిపించమ్ములఁ • నెమ్మిఁమైఁదాల్చిన
మాధవుతనుకాంతి • మహిమఁదూరి
కమలనాభునిభుజా • గ్రమునఁదాండవమాడు
భూకాంతనెమ్మిని • పొలుపుఁమీఱి
తే॥ కలితకాదంబ కాళింది • గరిమఁదీటి
నవతమాలావృతాంజన • నగముఁగీటి
రోదసీగహ్వరమునఁ బే • ర్కొనియెఁమేటి
కటికిచీకటిమత్తేభ • ఘటలుధాటి॥ 172

తారకావళీవర్ణనము.

తే॥ గీ॥ భర్తవచ్చునటంచుఁ రే • బడఁతికోర్కెఁ
బూసితోడికట్టినకడాని • పుట్టుముపయి
వెండిపూలనఁజుక్కల • పిండుదోఁచెఁ
దళితప్రభయనఁబ్రాచి • ధవళమయ్యె 173

చంద్రోదయవర్ణనము.

తే॥ గీ॥ పూర్వదిగ్భామినీవక్త్ర • పుండరీక
మోయనంగఁసుధాకరుఁ • డుదయమయ్యె
నమ్ముదితమృగమదతిల • కమ్మనంగఁ
లలితకాంతిఁజెలంగెఁగ • ళంకరేఖ॥ 174

ఉ॥ అప్పుడుపుష్కరస్థలి మ హత్తరభంగుల సత్పయోధిగా
నొప్పుడు ఫేనతారకలు • నొక్కటఁగ్రాలుడు శేషశయ్యనా
నొప్పుడునోషధీశుఁడు మ • హోద్ధతితోడఁ రమాధవుండు నా
జొప్పడుచుండెనానడిమి • చుక్కయుఁనల్లగఁజూపరెన్నఁగన్॥ 175

చ॥ తోవ చెలి వేడ్కఁ బొంగ నల • తోయజను ల్వెతచేముడుంగ జ
క్కవలకుకుంగనంగ శశి • కాంతమణిప్రతతుల్కరంగఁ బాం
థసరముల్కలంగ రతి • నాథుఁడుగండుమయుంజెలంగ బ్రా
గవిపతిపై నెసంగఁ గన • నయ్యె నిశాపతితాఁబొసంగఁగన్॥ 176

మత్తకోకిల. కాముదీధనకాంతవస్తుని • కాయఁపున్ విటపాళిఁబల్
దీమునన్నెలత క్కమచ్చికి • జెల్లవోవఁగఁ జేసి యొం
లే ముదమ్మునఁసీడలన్నిటిఁ • దెల్పొనర్పఁగ లేక కన్
బ్రాము చేడ్వఁదొఱంగుసీరన • ప్రాలునుర్విహిమాంబువుల్
రుమాదేవినంగజుం చుటు.

శా॥ ఆలోఁదారుననుంగుఁబట్టి రవిపుత్రాకారచేష్టాదులన్
లోలోమాటికి వేడ్కమైఁదలపుచున్ • నాఁ మేడఁబూసెజ్జఁగ
న్యాలోకమ్ములు లేక నొక్కతయు యుం • డంగాంచి బూవింటివాఁ
డాలోలాక్షిఁజకాఁ చేసె నికనే • మందుం గురం గేక్షణా!॥ 178

వ॥ అంతనక్కుమారికామణి ప్రియకాంతామణి నొకర్తు జేరి రహస్యం
బున నిట్లనియె. 179

సీ॥ వలరాచరాదళ • మ్ములకునుయ్యెలగుట్ట
యనఁదగునదికినే • నటుగనేల
యటిగిననేమాయె • నర్యమాత్మజుఁడునా
పద్దకుఁజెలి క్రీడఁ • వచ్చె నేల
వచ్చిననేమాయెఁ • మచ్చంచలాలోక
నమ్ములువానిపైఁ • గ్రమ్మనేల
గ్రమ్మిననేమాయెఁ • గ్రమ్మరవాఁడునా
హృదయమెంతేఁదస్క • రింపనేల

తే॥ తస్కరించిననేమాయెఁ • దమ్మికంటి
కొమరుఁడమ్ములఁప్తొమ్మునఁ • గుమ్మనేల
గ్రుమ్మగానాతఁడింతలోఁ • గ్రూగుడగుచు
ననువియోగాబ్ధిలోఁద్రోసి • చనఁగనేల॥ 180

క॥ అనినేత్రకస్త్రోత్రోఁ నెమ్మనిట్లాడి మిట్టారివాఁడి ♦ మెఱుఁగుటలుగులం
గనికరమఱిపఱపెడుమారుని నిందింపంగఁదొడఁగెఁ ♦ రూక్షోక్తులతోన్॥

మన్మథదూషణము.

ఉ॥ పుట్టితివాదిదంపతుల ♦ బొజ్జనుశుక్తినిముత్తెపుంబలెం
బట్టితివాభవాది సుర ♦ వర్యులనేనిఁగలంచుకైదు వు
గట్టితివౌజయధ్వజమ ♦ ఖండవిరాగులఁ గెల్వఁగా నిలం
జుట్టితివౌదిశాకరుల ♦ శుద్ధరదాళియశోభిసంబులన్ ॥182॥
క॥ ఇటువంటివాఁడవయినీ వెటువంటిఘనంపుఁగార్య ♦ మిదియంచునిశా
విటువంటివెరాముగలసకి విటువంటివెతంగుడిసిలి ♦ వించువిలుదొరా
శా॥ తోఁడంబుట్టినదానిగేహపదవిం ♦ దోఁడంబొరింగొన్న తేం
తోఁడంబుట్టినదాదిగాఁ మెలఁగు నీ ♦ తోఁడంబొరిన్నిగ్గగుం
దోఁడంబుట్టినదానిగావ్రమనఁదో ♦ త్రోనయ్యయో! యబ్బగాఁ
దోఁడంబుట్టినదానికన్నఁ మెలగం ♦ దుర్మార్గచేష్టల్ ధరన్ ॥184॥
క॥ ఓవలరాయఁడ! ద్రుహిణుఁడు నీవలనంజరుగువిరహి ♦ ణీవధగనికా
మావలను "మార" నామముఁ దావలనుగఁ బెట్టెఁజెల్ల ♦ దానీకదియున్॥

చంద్రదూషణము.

వ॥ అని గోవిందనందను నందందమందలించి విన్నందునం దొగవిందు
క్రందునంగా యుఁ రేయొండవేడిమింబోడిమిం జెడి తత్తోఁపనకోపం
బున నాతఁపాకరుఁగేలంజూపుచు నేపున నిట్లనియె.
క॥ ఓచంద్ర! "రాజ" నామము ♦ నేచతురాస్యుఁడిడెవిరహి ణీసంహరణం
బేచతురతయనునీకహ హా! ♦ చతురతగురునివద్ద నద్దిచదివితో ॥187
క॥ రాతిరిదిరుగుటచేడెల ♦ నేతఱినేచుటసిరిచెలి ♦ కెగ్గించుటచే
ధాత "నిశాచర" నామము ♦ దైతేయులకుబలెనీకు ♦ దానిడఁదగు రా! 188
క॥ కొందఱిఱి మఱియనిరివెఱినందఱిమాటమన కేలయందువిరహులన్
ద్రమందింపఁదద్దురితమిటుపొందినదంచువినుఁగందుపొలుపున నెంతే 189

దక్షిణానిలాదులదూషణము.

క॥ బాలామణియీలాగునఁ బాలానిలశుకపికాళి • పాళికడిమిమై
బాలార్వఁగ్రమముగాబరి • శీలనముగఁ వానినింద • సేయగదొడఁగెన్

సీ॥ తక్షకాద్యహిరాజ • భక్షణీయుఁడవైన
దక్షిణానిల! యేల • తగనిపాటు
కొమ్మపల్కులునేర్చి • కొమ్మఁద్రిమ్మరివైన
కోదమచిల్కా! యేల • యదరిపాటు
నొడ్లపంచలఁజేరి • యొజ్జబెంచఁగవైన
గండుఁగోయిల! యేల • మండిపాటు
నిమ్మలఁగనకగం • ధమ్ములఁగలనైన
నెరుగనియళి! యేల • యెగిరిపాటు

తే॥ పంచబాణునిరథ • హయబలగుణముల
మంచుఁబొంగకుఁడీమీరు • నట్టులైన
త్ర్యంబకుఁడుపాసనాదైవ • మగుటనాకు
మీరుమీరాజుననుఁగెల్వ • లేరుసుమ్మి 191

వ॥ అనిమందసమీరకుమారుఁదూరి చిలుకలనలుక దొలుకబలికి వనప్రి
యమ్మల నప్రియమ్ములాడి మదాళిపాళిదూలించినవిని రుమాకు
మారికామణికామె చెలియిట్లనియె. 192

చెలికత్తెలుతమతమదేవితోఁ సుగ్రీవుఁడువిరాళిఁ బ్రుంగియుండెనని
విన్నవించుచునూరార్చుట.

సీ॥ వినుమురుమాసతి! • వినుకెంపుకొమరుండు
నీదండబాసినీ • పైదమినిను
నెదదలంపుమదమ • యిమ్మునకుంబోయి
ఘనవిరహాగ్నిలో • గాగిక్రాగి
నేస్తకాసంగూడి • నెఱఁబూవుదోటకై
చనియొక్కమెలమావి • చక్కఁజేరి
యచ్చోటవిహరింపు • చెచ్చుటగనుగొన్న
బచ్చువిలునిసేన • పెచ్చురేగ

ఆ॥ వె॥ వానిదాడికిఁ జట • దానిలువఁగ లేక
మనికి కేఁగనచటఁ • మరుడిషుప్రల
గ్రుమ్మఁ "ముల్లుపుచ్చి • కొఱ్ఱుడచిన" చంద
ముయిన నిన్నుఁ గూర్చి • నాత్మఁ దలఁచి 193

ఉ॥ పాయుచుఁ బల్కకేఁగ వెఱ • పాయను బాళిని గాంచకుంఘుటిం
పాయనుఁ బల్కవింతమఱ • పాయను నగ్గురుణాబ్ధిఁ దేల్చుఁ తె
ప్పాయను మేరమీరుటోఱ • పాయను నారతనాలమేలి కు
ప్పాయను మేలుఁ గూర్పుమికఁ • పాయనుపాయుట నేరుపాయనున్॥

చ॥ పడతిరో! పిల్వ కేఁగ వెఱ • పామర పాపోరపాటవేదనా
జడధి నిటూచి త్రోంచ నలు • చాపెలు చాఖలు చాయఁ గూర్మిలోఁ
మడచి దశాల్నఁ బోసమయ • మా నయమా దయమాలి వేదనం
గడపుము నాకుఁ దోడవుము • కావుము కావుము కావుమర్మిలిన్॥ 19[illegible]

మ॥ అనిత్యాత్కోశికంబు ఘాత్మరమణీ • హస్తాబ్జకీరమ్ముఁ గూ
ర్మిని జూడం జనిన చ్చుచోఁ దెరువున • న్మేలంచుఁ గిష్కింధలోఁ
మనికిన్మారుసిఘాకకోర్వకడలం • బాటించి నానంచు బా
ళిని నాతోన నెవాఁడు నీవలె విరా • శింబ్రుంగుచుం డెంజెలి! 196

క॥ కావున నతనికీనియెడఁ భావముకందంచు నేను • బలికెద నతఁడున్
నీపుంఘుచోటికి నిరహిఁ రావలెననియుండునట్లు • రాజేని చెలీ! 197

క॥ సీతంబ్రడికిఁ జెప్పిదయా స్వీతుండతఁడు జెపిఁ బెట్ట • వేమరు వానిన్
బ్రీతిఁ బిలిపించి కార్యముఁ జేతికినందంగ నేన • చేయుదుసుమ్మీ!

ఉ॥ ఇట్టని కేల మోముఁ బట్టు • కెత్తి కురుల్ కడకొత్తి పేర్లుజన్
మిట్టలఁ జక్కహత్తి నెఱి • మేసిరిగందముఁ మెత్తి వీనులం
బిట్టుగఁ గ్రమెత్తి కను • సూలహిమాంబులవిత్తి నాడు[illegible]
గట్టుగ? యొాచ్చుకొమ్మనుచు • నాతుకయక్కునొత్తి తేర్చఁగన్।

ప్రభాత కాలవర్ణనము.

క॥ ఇక్కరణినుండఁ గోడలిఁ
జక్కరహింగొమరుఁ గూర్పఁ • జనుదెంచెదనం

చక్రవర్తిసాక్షి వంపఁడ
టుక్కనవచ్చునసిఖరభ ♦ టుంటై నాగన్॥ 200

వ. అఖండలదిగ్వేదండయానమున నుండలంబోయనఁ దూర్పుగొండఁజొ
క్కపాటుక్కనంబొడుచుటయు

చ॥ కొలఁకులఁ బ్రమోసెఁ దమ్మిదలు ♦ కొక్కొరొకోయనికూసెఁ గోళ్లది
క్కులకొగిఁడాసెఁ జీకటులు ♦ కోకములా రిసిబా నెల్లం
కల్లజగిమాసెఁ మున్మిఘుఁడు ♦ గార్ముకమెక్కుడుదీసెఁ గల్వలి
క్కలఁ వెతమే పెఁదమ్మిచెలి ♦ కాంతుని కైకయిసేసె నెమ్మియిన్
॥ అవ్వలఁ దూర్పుగొండపయి ♦ నంబుజమిత్రుఁడు గల్వ జేఁడుదా
నివ్వలఁ గ్రుంకుమెట్టపయి ♦ నెంతయుఁ జూడగ నొప్పిరా! పవల్
జవ్వని జేఁడువచ్చునని ♦ చక్కఁగఁ గొప్పఁ ఘటించి చూడఁగా
నవ్వలవివ్వల న్మెఱుఁగు ♦ టద్దములింపుఁగ నిల్పెనోయనన్ 203

చంద్రాస్తమయవర్ణనము.

తే గీ॥ కలువపూఁబోఁడిఁ గూడినీ ♦ తొలఁగు బావ
రాఁదలఁ చెఁజామ్మటంచుఁద ♦ ద్రమణి కెరుగఁ
బలికిస్నానమ్ముఁ గ్రమ్మఁదీరఁ ♦ బశ్చిమాబ్ధిఁ
జల్ప నేగినగతిఁ గ్రుంకెఁ ♦ జలధివిధుఁడు 204

సూర్యోదయవర్ణనము.

తే గీ॥ ఓలిఁ సతపేరిపచ్చగు ♦ ఱ్ఱాలజతన
మర్చిసరథంబుఁ దోడలేని ♦ మల్లుఁ డోకఁడు
దోడితేనెక్కిహారిదోచెఁ ♦ దూర్పుఁగొండఁ
బ్రాగ్దిశాకాంతచేతిసహా ♦ న్బంతినాగఁ 205

తారుఁడుకొమార్తె మనం బెరిగి ఋషువిరజునకుఁ వాతఁ
మునంపుట.

శా॥ అంతం దారుఁడనుంగుబట్టిహృదయం ♦ బాప్రొద్దుచూల్ పైన న
త్యంతంబుఁ డుటనా మొకూర్మి చెరిచే ♦ తఁ వించుఁగ న్యామణీ

స్వాంతంబెట్టులొ యట్టుసల్పుటయుక ♦ జటాబంధుఁ దానెంచుచుం
స్వాంతంబాదునఁబాడితప్రతతిఁబి ♦ ల్వాంబంచి సంప్రీతిమైన్ ॥ 206

కం॥ ఓప్రాజ్ఞులార! వినుడీ ♦ నాప్రార్థన ఋషివిరజు ♦ నందనునకు నే
నిప్రాయఁపుఁజెలిఁరుమనిడి, నాప్రాక్తనదురితములన ♦ణంచికొనియెదన్

వ॥ అట్లుకావున 208

శా॥ శ్రీమంతమ్ముఁగపీశ్వరాఖ్యమగుకి ♦ ష్కింధాపురంబీరటం
ప్రేమంబోయికపీంద్రుఋషివిరజున్ ♦ వీక్షించి కార్యంబాగిం
దామంతంత నెరుంగఁజేసిరహినా ♦ తండిష్టపడ్డన్వెసన్
క్షేమంబొప్పముహూర్తముం దెలిపివి ♦ చ్ఛేయుండుమీరంతటన్

పండితులు బెండ్లిరాయభారమ్మునకై ఋషివిరజునికడ
కేగుట.

వ॥ అని చెప్పి పుచ్చుటయు వారలత్యంతాదరమ్మునఁ గిష్కింధానగరమ్ము
నకుంబోయి ఋషివిరజు కపిరాజరాజుఁగాంచి వారలంతకుమున్న
భక్తిపూర్వకముగ నెదుర్కొని కొంపోయి కూర్చుండఁగద్దియలిడి
కుశలం బడిగి

చ॥ శతధృతినందనా! వినుము ♦ శంభరిపట్టణమేలుదారుడన్
దతధృతిశాంతిసన్మహిమ ♦ నందనయైనరుమాకుమారినీ
సుతుఁడుసునక్కఁగోరినది ♦ సుమ్మది కావున నాదునీడుసీ
సుతునకుఁబుత్రినీఁదలఁచి ♦ నూడిదమమ్మిటకన్పెంనాఘృషన్

సీ॥ ప్రాజ్ఞులారా! మాకు ♦ నంతకంటెను శుభ
కార్యమొండున్నదె ♦ కన్యనిత్తు
మంచుఁబుత్తెంచిన ♦ యాతారునకుఁ దెల్పుఁడ
రుదెమ్మటన్నచో ♦ నాత్మజుఁగొని
వత్తుమెంతేనన్నఁ ♦ వల్లెయంచనివారు
సుముహూర్తమెల్లుండి సొరిదిమీరు
విచ్చేయుఁడనిపల్కి ♦ వెళ్లితారుంగాంచి
జరగినవృత్తాంత ♦ సరణిఁ దెల్పి

తే॥ వత్తురెల్లుండి పెండ్లికిఁ ◆ వారలంచుఁ
ప్రాజ్ఞు లెరిగించి వెళ్ళిన ◆ రాజునంతఁ
బట్టణంబెల్లఁ గైసేయఁ ◆ బంచితగుప్ర
యత్నమునను(ం)డెనక్కడ ◆ నలరి వారు 212

ఋక్షవిరజుండు సుగ్రీవునివివాహంబునకుం దరలి
శంభరీపురికి వెళ్ళుట.

మ॥ మదినింతంతనరాని సంతసమునం ◆ బ్రహ్మాత్మజుండార్యులం
బదిమూఁడింగులవృద్ధబాంధవతతిం ◆ బ్రార్థించి రప్పించి ప్రో
లీఁదివంబుంబలె నంతకంతెమునుబా ◆ శిస్మిరంగై సేయఁ జే
సిదినేశాంశజుఁ వేడ్కఁ బెండ్లికొమరుం ◆ జేయంగ ముత్తైదువల్ ॥

ఉ॥ స్నాతకముం బొనర్చుకొని ◆ స్యందనసామజఘోటకాళిపై
నాతతబంధువర్గములు ◆ నార్యులు రాఁగ సమస్తవాద్య సం
ఘాతఁ ప్రమోతలుం దెసలు ◆ గ్రమ్మఁగ సితేభరాజముం
భ్రాతయుఁ దాను నెక్కి తన ◆ ప్రక్కనుఁ బ్రొద్దుటనుంగుగుజ్జుఁడున్ ॥

తే॥ కూడ రాఁ ఋక్షవిరజుఁడు ◆ గోమరుండైనఁ
లెస్పకుత్తుకవాని పెం ◆ డ్లికి నిజనియోఁ
గాణలెంతయు నాడఁరో ◆ కలుకులాడఁ
బ్రాహ్మణుల్ వేదమంత్రంతఁ ◆ బలుకఁ దోడ 215

క॥ ఈకరణిని వాద్యార్భటిఁ లోకముల ద్రువంగఁ విబుధ ◆ లోకమ్ములంతోఁ
జోఁగజనె శంభరికిఁ సుగుణాకరుఁ డతఁడరుకుఁ డుదయ ◆ మందకమున్నే ॥

తారుని మంత్రులు ఋక్షవిరజాదుల దోడ్తెచ్చి
విడిదిలో దించుట.

ఉ॥ అంతకు మున్న శంభరి పురాధిపుఁ ◆ డంపఁగ వచ్చి మంత్రుల
త్యంతకుతూహలమ్మునఁ మ ◆ హావిభవమ్మునఁ గొంచుఁ బోయి య
భ్యంతరమందిరంబునన ◆ వారలఁ డించిచనం బురోహితుం
డంతముహూర్తఁపుంగడియ ◆ లాగమనం బగు నంచుఁ బల్కఁగన్ ॥

వ॥ పదంపడి విద్యాహాయ్యగ్రీవుండునైన సుగ్రీవునకుం బుణ్యాంగనాజ

నంబులునలన మంగళస్నానంబు నిర్వర్తించి ప్రాంచితదుకూలాం
బరంబులఁగట్టించి సువర్ణమణిమయాంగదంబులఁ బెట్టించి కస్తూరీ
తిలకంబు నళికంబునఁదిద్దించి శ్రీచందనంబందంబుగ నొడలనలదించి
వెండిబెత్తంబులఁ ఝళిపించి పట్టినభటచయంబు లోరలఁబాగుదీర
భూసురాశీర్వాదనాదంబు బాగుమీర మంగళవాద్యార్భటులు
డంబుమీరఁ బెండ్లికొమారు సితగజారోహణంబుగావించిమోదించి
పురవీథివచ్చు నెడవరునకుఁ బురంధ్రీరత్నంబు లొసంగు కర్పూర
నీరాజనంబులందికొని వివాహమండపోపరి స్థలస్థితకనకకలశంబుల
నుపలక్షించి శుభలక్షణంబుగా నెంచి తదీయద్వారపార్శ్వంబుల
నూతనజామాత్రాహ్వానంబుంబొనర్చు వైవాహికమంటపలక్ష్మీ
కరపల్లవంబు పొలుపుఁదెలుపుచు నానతంబులగు తూగాడురంభా
తరుపల్లవంబుల శోకకలరుచు నంతంత నృత్తగీతాది వినోదంబుల
నిలకింపుచు బుకువిరజాదులే తేరనంత నక్కడ 218

మ॥ అలరుంబోంట్లు రుమాకుమారిజలకం • బాడించినీరొత్తి క్రొ
వ్వేలదూర్చి త్తికురుల్ఘటించి నెఱికీ • లుంగంటుహొన్నాగరా
మొలగట్టించిజిలుంగుచైకదొడిక్రొం • బొంజేలనోణీగజె
న్నలరంగారచియించిహొన్నగతెగల్ • హత్తించికస్తూరితో
తిలకంబుంగయిసేయవచ్చెజెలివే • దీసీమకుఁ సిగ్గుతోఁ 219

వ॥ ఇట్లునేస్తకత్తియలుదోడ్తేర వారికయిదండలనూని రుమాదేవివచ్చి
న నిక్కడ తారుండు. 220

## వైవాహికవర్ణనము.

ఉ॥ ముద్దులపెండ్లికొమ్మయును • మున్న నెదుర్కొనివాడు మ్రొక్కినం
గ్రద్దనబెండ్లికొమ్మవిక • గమ్మనిదీవెనలిచ్చిమంత్రులుం
దద్దయుగూడఁ బాసకల • తాళమృదంగరవంబు సెల్లగా
బెద్దయుఁదోడితెచ్చినెఱి • పెండిలితిన్నియనిల్పెనల్లునిన్ 221

మత్తకోకిల. ఇట్టిశేషవిశేషవాద్యము • లెల్లమ్రోగఁగధనాంగనలు
నెట్టిక్షధయియంచునాడన • నేకబాంధుపులెన్న హాం

బట్టుపుట్టపుఁడోయిమేల్ మధు ♦ పర్కమిచ్చి సిరిన్నెఱిం
బట్టుపుట్టపుఁడారికిచ్చిన ♦ పాలసంద్రు, నకీడుగాఁ
బట్టియొసఁగారుమఁధారవోసెను ♦ బాళిదారుడునర్కికిన్ 222

క॥ హాళినిజెందగవిందులుబాళినిబ్రాల్గంపనుండు ♦ పట్టికివరుచే
దాళినిగట్టించగఁబెరయోలినిదగ్గరకువంప ♦ నాగిదంపతులున్ 223

చ॥ ఒకరొకరింగనుంగొనెడు ♦ చో! వరుచూపుక్కలుకల్కిముద్దునె
మ్మొకమునమోహనంపువల ♦ పుంగబరింజనుపూలబంతులం
బ్రకటతరోరురంభలను ♦ బర్వెదదీయవిలోకనాబ్ధిలో
జకచకనేగుచేపలన ♦ జానవిలోకనముల్ తగెంగనన్ 224

మత్తకోకిల. కట్టెనర్మిలిఁదాళివారిధిఁ ♦ గల్గుచిందఃపుఁగల్మినే
నట్టె కొన్దగుకంఠసీమఁవ ♦ రాంగుళీయరుచుల్ గొనాల్
పెట్టెయొసఁగారుమకంఠహారఁపుఁ ♦ బెంజగాగిఁతోడఁదా
నట్టెయేకముకాఁగఁజోకన ♦ హాస్కరాత్మజుఁడెంతయేన్॥

చ॥ అడుగులుత్రొక్కలాడ నస ♦ దాకవునల్లలనాడఁముంగురుల్
ముడివడిమోముగూడ నెద ♦ ముత్తెఁపుసెత్తులుదూగియాడ న
ప్పుడుదమవారుఁజూడఁ మిను ♦ పూవుకొమారునిపైనివ్రీడ న
ప్పడతుకదోసిలెత్తితల ♦ బ్రాలనుబోసెనుజూపుచున్నెఱిన్॥ 226

మ॥ వలెవాటంసమునుండిజారఁసరులా ♦ పైఁరొమ్మునంబోరఁ గ
న్నులునందంబుగనెఱ్ఱవారఁముఖసిం ♦ ధూరమ్ముజాల్వారఁ బ్రోఁ
గులడాల్ జెక్కులగ్రేల్లువారఁనవ్వుని ♦ గ్గుల్ మోముపైఁజేరఁగాఁ
దలఁబ్రాల్ వోసెఁరుమాకుమారిపయిఁమా ♦ ర్తాండాత్మజుండర్మిలిన్

క॥ ఆజలజనయన పెట్టిన లాజలఁవ్రేలిచెనతఁడన ♦ లప్రీతిదమిన్
ధీజనముశమీశుష్కములోజననేకమ్మొసంగి ♦ యొనరించుశిఖిన్॥

క॥ ముడివెట్టఁజెఱఁగులింతులు
ముడివెట్టెఁబడంతికన్ను ♦ బొమలనునానన్
ముడి నెట్టెఁదేరినారిని
ముడివెట్టంజాలు మరుఁడు ♦ బూవింటరహిన్॥ 229

॥ మఱియునాదంపతులు 230

॥ పేరంటాండ్రుఘటించుకొంగుముడులం • బ్రేమమ్మునందాల్చి క
న్యారంగాంచియరుంధతీధ్రువులను • న్స్వాహాధినాథున్ గను
స్కారంబర్మిలిఁజల్పి పెద్దలొగిఁమా • ర్కండేయునంతాయువో
ప్పారంబల్కి శుభాక్షతంబులిడన • వ్వానిందలందాల్చిరా!

తారుఁడు గూతున కల్లున కరణంబిచ్చిపుచ్చుట.

॥ నాకబలితుదగఁ గ్రమముగ
నీకరఁశిగ నైదుదినము • లెలమినడునఁగాఁ
లోకమెరుగఁగఁజల్పి గు
ణాకరుఁడగు తారుఁడల్లు • నకుఁసంప్రీతిన్ ॥ 232

క॥ అరదంబులులక్ష మద
ద్విరదంబులుదద్విగుణము • దీప్తాశ్వములుం
ద్విరదంబులకుం ద్విగుణము
నరదంబులకుం ద్రిగుణము • నలభటులనిడెన్ ॥ 233

క॥ రత్నములఁ మఱియుఁగన్యా, రత్నములను వేయికనక • రజితములసతీ
రత్నములలరఁగఁగన్యా, రత్నమునకునల్లునకున • రణమిడెఁ బేర్మిన్

క॥ మఱియుంగూతున,కల్లన కఱగొఱ లేకుండఁసకల • మగువస్తువులన్
నెఱినొసఁగిహొన్నుపట్టుం, జెఱగులదువ్వల్వలిచ్చెఁ • జెన్నలరారన్

క॥ విందులకుఁశబరివిదురుల, విందులకుంజోడుఁరాఁగఁ • వేడుక నెట్టెన్
విందులఁదేజనఁదమ్ములు, విందులనంజాలుబుక్షు • విరజాదులకున్

వ॥ ఇట్లొసంగి జాంబూనదాంబరాభరణాదులిడి తారోర్వీతలేశుండు ముద్దుపట్టి నొద్దంజేర్చి యక్కునం జక్కనొక్కి ముద్దాడి చుబుకంబుఁ దువ్వుచు నిట్లనియె. 237

సీ॥ పెనిమిటిమదిఁగని • పెట్టిపోఁగదవమ్మ
యత్తమామల కెదు • రాడకమ్మ
యోడఁబిడ్డలకడ • నణఁగిమెలఁగుమమ్మ
మేరాండ్రయెదఁదగ • వెరుగుమమ్మ

పిన్న పెద్దలనతి • ప్రీతిఁ గొనుమమ్మ
దాసీలపైఁ దయఁ • దప్పకమ్మ
భర్తమిత్రులనతి • భక్తిమైఁ గనుమమ్మ
భర్తశత్రులకంటఁ • బడకుమమ్మ
తే॥ పురమువారి కెల్లఁ • బూసలలోఁ దార
మట్లు గృపకుఁ బాత్ర • మగుము కొమ్మ
మమ్ము నెదను దలఁపు • మాయమ్మ రవ్వయుఁ
రట్టు లేక జోక • బ్రతుకుమమ్మ ౨౩౮
చ॥ ఎరుగవు వట్టి గోలవిటు • లేడ్వఁ గఁ జెల్లున పిచ్చిదాన! నే
వొాలలిన నామనంబడలు • చున్న దినీదు వియోగవారిధిం
దరము భరింపఁ నీదయిన • తమ్ముని బంపెదఁ గాదకూడ స
త్వరముగ నెల్లి నేనయినఁ • వచ్చెద "నమ్మ" గ "పొమ్మ"టంచుఁటన్ 239
క॥ ముద్దుం బెండ్లికొమార్తెను,
ముద్దుం బెండిలికొమారుఁ • మొగిఁ దారుఁ బదా
నిద్దఁపు టద్దఁపుఁ బల్లకి
నిద్దర నిడి పుచ్చెఁ వేడ్క • నం తే విభుతన్ 240
వ. ఇట్లు సబహుమానంబుగా నెల్లబందుగులం బుచ్చుచు వారలతివైభవంబునఁ గిష్కింధానగరంబునకు నరిగిరని పల్కుటయు దరువాతి వృత్తాంతంబు వినగోరుటయు 241

ద్వితీయాశ్వాసాంతపద్యములు.

క॥ స్తుతిజనకధర్మగుణాశో, భిత! హరిపత్పద్మగంధ • పీయూషరతా!
శ్రితజనసంరక్షితమ, త్కృతసత్కృతిసహితతతవి • తీర్ణరవిసుతా!

భుజంగప్రయాతగర్భితస్రగ్విణి.

నీరదాభద్యుతీ! నిశ్చలోద్యద్ధృతీ! స్ఫారభాస్వన్మతీ! పాలితాస్మత్కృతీ!
ధీర! మారాకృతీ! దివ్యభాస్వత్కృతీ! సారలక్ష్మీభృతీ! చారుకీర్తీ! ధృతీ!
తుది రెండు వర్ణములు మొదల నిడిచదివిన భుజంగప్రయాతవృత్తమగును.

ఆందోళికా బంధము.

క॥ ధీవరగేయచిత్తా! ఘోరకలుషవేషభాష•గుణీకృత్త!శరత్
ధారాధరగోరధరా • ధారాజత్కుందకీర్తి•తత్పర!వరధీ! 245

మాలినీవృత్తము.

స్మరవిధునిభవేషా! సత్యభాషావిభూషా!
ధరణివిబుధపోషా! ధర్మకార్యాభిలాషా!
వరమతిజితశేషా! వందనీయార్యతోషా!
అరిబలవిజిగీషా! స్వాన్వయాంభోజపూషా! 246

గద్య

ఇది శ్రీమ"దచ్చాంధ్ర నిరోష్ఠ్య నిర్గద్య నృగచరిత్ర"కృతివిరచనాచాతు
రీధురంధర సద్యశోబంధుర కౌండిన్యగోత్ర కలితాపస్తంబసూత్ర
చతుః కాబ్జరాజాన్వయపయఃపారావార రాకా
కైరవమిత్ర నృసింహామాత్యపౌత్ర మంగాంబా శేషా
చలామాత్యపుత్ర సుధీజనవిధేయ హనుమంత
రాయనామధేయ ప్రణీతంబైన శ్రీమత్సు
గ్రీవపట్టాభిషేకంబను మహాకావ్యంబు
నందు ద్వితీయాశ్వాసము.





శ్రీసీతారామాయనమః

# శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకము

హానుమత్కవీయము.

(తృతీయాశ్వాసము.)

క॥ శ్రీమత్కుముదకులార్ణవ సోమ! వివేకాభిరామ! స్తుతిజనకగుణ
స్తోమ! మహాకావ్యసతీ కామ! పకీరయసనామ! ఖరకరధామా! 1

క॥ అటమీఁది తెఱఁగువినుఁడు త్కటకరుణంజంద్రధరుఁడుగౌరికిక్షితిభృ
త్కటకముననుడువువపువ్రన నటనూతుఁడుసెప్పెమునులకవలికతవినన్

ఋక్షవిరజుఁడెల్లరతో నిల్లుసేరుట.

వ॥ అట్లు ఋక్షవిరజుం డెల్లవారలతోడం బురంబుఁ జేరి. 3

శా॥ శ్రీరాణించెడుకోడలింగొడుకు గూ ♦ ర్మిన్మీరహర్షోన్నల్ల
లోరాణించఁగనుంచి వాద్యరవళిన్ ♦ లోకమ్ములట్టిట్టుగాన్
నీరేజాక్షులుమేడలన్నిలచి యెం ♦ తేలాజలంజల్లగా
నూరేగించి గృహప్రవేశమటనా ♦ రోక్తిన్నివర్తించినన్॥ 4

ఋక్షవిరజుసభకుఁ బుత్రయుతుఁడై వాయువువచ్చుట.

ఉ॥ అంతటనొక్కనాఁడు ద్రుహి ♦ ణాత్మజుఁడాత్మసభ న్వనాటుల
త్యంతముదంబునంగొలువ ♦ నాత్మజులిర్వురు గోత్రభిద్దివా
స్వంతులరూపతేజముల ♦ బంగరుగద్దెల గ్రాలఁగా సభా
భ్యంతరసీమకొక్కరుఁడు ♦ వచ్చె గుమారకరగ్రహాఢ్యుఁడై॥ 5

వ॥ ఇట్లు వచ్చిన 6

ఉత్సాహము. ఆశుగాఖ్యుఁడంచుఁ జూప ♦ రాత్మలందలంప డ
త్త్యాశువేగముననవచ్చి ♦ నట్టివాయుదేవున
త్త్యాశదోడితెచ్చియాస ♦ నాదులిచ్చిభక్తినా
క్కాశనిల్చికేలుమోడ్చి ♦ యతనిగూర్చియిట్లనున్ 7

క॥ పాలుజిలుకు చెక్కులజున
పాలుబుజాలహారనుసాలు ♦ పయిజందెముమో
కాలుందాకెడుచక్కని
కేలుంగలముద్దుకుఱ్ఱ కేల్వట్టె ♦ వెసన్॥ 8

ఉ॥ ఎన్నఁడు రాసి పెద్దలిపు ♦ డింటికి వచ్చితి రేమి చెప్ప నా
పున్నెము "గువ్వగుంటపయి ♦ బుష్కరవాహినివారె" నన్న మీ
రెన్ని పేలవచ్చితిరొ ♦ యీపసిబాలకుఁ డెవ్వఁడొక్కొ నా
కున్నతిఁదొల్కబేర్కొనుమ ♦ కుంఠితరీతిఁ గురంగవాహనా!॥ 9

వ॥ అనిన పృషదశ్వుం డతనికిట్లనియె. 10

ఆ॥ నాకుఁబుత్రుఁ డీతఁ ♦ డేకాంఘ్రిరుద్రుండ
టంచుఁబల్క వింటి ♦ నార్యులద్ది
యట్టులుండనిమ్ము ♦ సజ్జసంభవపుత్ర!
వీనిపుట్టుపువిను ♦ బేర్కొనెదను॥ 11

## హనుమజ్జననము.

సీ॥ తనధైర్యకనకాద్రి ♦ దానవారులకెల్ల
కోర్కిమై పెట్టని ♦ కోటగాఁగ
దనకేసరిసమాఖ్య ♦ దైత్యమత్తేభమ్ము
లకుఁగుండెలోనిగా ♦ లమ్ముగాఁగ
దనతపోమహిమమ్ము ♦ మునితల్లజులకెల్లఁ
బరగంగనొజ్జమే ♦ ల్బంతిగాఁగ
దనకేలుగొమ్మలు ♦ దైవతాండజములు
కూడిమాడగనిల్వ ♦ నీడగాఁగ
ఆ॥ సమరుకేసరికిని ♦ నంజననాఁగన్య
నిచ్చి పెండ్లిసేసె ♦ నెలమివాని
మాతులుండువిక్ర ♦ మాతులుండొక్కండు
కుంజరుండనంకపి ♦ కుంజరుండు॥ 12

క॥ ఈసరణిఁ బెండ్లియాడిన
కేసరితత్కుంజరసుత • కేళినిమిషులం
భాసురముగఁ దానెన్నే
వాసరములుగడపెఁ గాంత • స్వాంతము వొంగన్॥ 13

ఉత్సాహము. వసుధఁగాపురంపుటుత్స • వంబునకును గారణం
బుసుతుఁడే నటంచు నెంచి • పోటిగూడి బహువ్రతం
బుసలిపియుఫలంబు దానఁ • బొందజాలకననునా
త్మసతి గొల్వ నాజ్ఞనిచ్చె • దైన్యముఁడుపుదం చొగిన్॥ 14

క॥ ఈగతిఁ బనుపఁగ నాకుస దాగతియస దాగతియని • తగననుభక్తిన్
శ్రీగతినినంజనాసతి యాగతియగు నరకు మదిని • నలరుచుఁ గొలచెన్॥

ఉ॥ ఆదటఁ దత్తపమ్మునకు • నాత్మను మెచ్చి మహేశ్వరాజ్ఞనా
స్వోదరసంస్థితంబగును • హాగ్రుని తేజము దెచ్చియిచ్చినన్
మీఁదటనంజనాబ్జముఖి • మేదురగర్భము సంభరించె నా
హ్లాదము తోడ నాతపబ • లాఢ్యుని నీతని నెక్కుడేడహాం॥ 16

ఉ॥ అంతట దేవదుందుభులు • నంతట మ్రోఁగఁగ వేల్పుటాంగ్రదున
త్యంతము నాడ వేల్పులుల • తాంతములం గురియింపదక్కసుల్
చింతలఁ బ్రుంగ నిర్జరుల • చింతల సంగ్రబభాతభానునిం
గాంతుల మీఱు శిఘ్రుడు • గొంజరిగర్భము నుండి వెల్వడెన్॥ 17

సీ॥ మెఱుపుతీవలకాంతిఁ • మించు నెమ్మెలువాని
బొందమ్మినగుముద్దు • మోమువానిఁ
బొలుపారు మొసలివా • ప్రోగులుగలవానిఁ
గపిలవర్ణంపుమేల్ • కనులవాని
పీఁకమైమోకాలు • దాకు చేతులవానిఁ
దెల్లనిమేలిజం • దెములవానిఁ
బెల్లుల్లసిల్లిన • పేరుటురమువానిఁ
డంబైన చేతిక • ద్యములవాని

తే॥ మంజురుచిపుంజిగుల్కుహారా ♦ న్స్రుంజివానిఁ
గ్రాలుహొంబట్టుసాలుబు ♦ జాలవానిఁ
బుడమిబుడిబుడినడకల ♦ నడరువానిఁ
గాంచెఁగన్నారఁదల్లిడా ♦ గన్నవాని॥ 18

హనుమంతుఁడుదయభానురాహువులం బండ్లనిమ్రింగఁబోవుట.

తే॥ అప్పుడాచిన్నికుఱ్ఱని ♦ నక్కుఁజేర్చి
సొక్కిచెక్కులుముద్దాడి ♦ చుంచుదువ్వి
చిన్నితండ్రి! ఫలమ్ముల ♦ నెన్నియేని
దెచ్చిపెట్టెదనిటనుండు ♦ దేయటంచు॥ 19

మ॥ పలుమారిట్టులుబుజ్జగించిసకివ్రా ♦ వంబాలుడాపైని ద
వ్వులఁబ్రాగ్భూమిధరమ్ముపైఁబొడము మి ♦ న్నువ్వుంజపాసూనకాం
తులఁగ్రాలందిలకించివేడ్కనొకపం ♦ డుంగానెదందల్చి ప
క్షులరాజుందులకించువేగమునఁగోర్కుల్ మీరదా కెన్వడిన్॥ 20

ఉ॥ ఈపగిదిందివాకరుని ♦ హెచ్చినయాకటిపెల్లునందగం
బాపఁడువట్టగాఁజనెడు ♦ పట్టునఁదజ్జవమారగాంచి లో
లోపలసిద్ధసాధ్యసుర ♦ లోకముబెగ్గిలియాడుకొంద్రు నీ
పాపఁడెవండొసూర్యుపయి ♦ బాఱెడురెండవరాహువోయనన్ ॥ 21

క॥ వినుమానికముకడకీ యచువునజనునపుడుపిల్ల♦డాతనిదీప్తిం
మిఱుకుననితరగచినుకుల వెనువెంటంజిలుకుచుండె♦నినుదాకరొహిన్

సీ॥ పాదసంఘట్టన ♦ బ్రహ్మాండభాండంబు
పెళపెళరవమున ♦ బీటవార
నూరుసంఘట్టన ♦ నూర్ధ్వలోకస్థుల
గుండెలుతటతట ♦ గొట్టుకాడఁ
బాహువేగమ్మున ♦ బయలబ్రాకెడువిమా
నమ్ములొక్కుమ్మడి ♦ వమ్ముగాగ
నాలవేగమునజే ♦ లాలపోలికతార
కాసమూహములునొక్క ♦ మొగిరాల

క్రొమ్మెఱుఁగునవ్వ్య మేనిని ◆ గ్గదిలకించి
మొక్కవ్రాఁగాననిమిషాఖ్య ◆ పొక్కిరవుదు
లెల్లనితఁ డేదియుఁగాంచ ◆ కేపుమీర
బాలభాస్కరువఁట్టెనో ◆ శైలచారి 23

వ॥ ఇట్లు బాలభానుఁ బట్టుసప్పుడు 24

సీ॥ వీనిపొడిమి పెక్కు ◆ విభుదాకెననిచాయ
బెగ్గిలి నెటికలు ◆ విర చిపరవ
మృత్యుంజయస్తోత్ర ◆ మెలమిబఠింపుచు
వాలఖిల్యులు మొక్క ◆ మూలకొదుగ
నాస్తిముక్తాయుధ ◆ హస్తులై చండాంశ
పారిపార్శ్వకులొక్క ◆ ప్రక్కజనఁగఁ
దీనిత్రాడెయెడ జెగిన ◆ దేయఁగ చాయ
దిట్టిన శేషమం◆దేహంలరుగఁ
బద్మినీకాంతు జేతుల ◆ బట్టుమోము
పైన బెట్టును వేడిమి ◆ బట్టజాల
కవల బెట్టును జేతుల ◆ నడచుగినిసి
కొట్టుమిట్టాడుశుద్ధనునీ ◆ కుట్టువాఁడు 25

భుజంగప్రయాతము. ప్లవంగేంద్రచంద్రుం ◆ బ్రపంచోపకారుం
డవంచర్యముండాతు ◆ ణాంబందునుష్ణం
బు వేజూపకుండంద ◆ వుల్ రాహువాల్లో
న వేగంబబర్వాంబు ◆ సావచ్చితాకేః॥ 26

క॥ ఆగ్రహము పెల్లురేగఁగ నాగ్రహవల్లభుని బట్టి ◆ నట్టడినా నా
ర్యగ్రహము వ్రాలెనాదా హుగ్రహమీహానుమ బట్ట◆నూహించుటయున్

వ॥ అంత 28

తే॥ అల్లమెఱుపండుబోనా ◆ డినల్లపం
డిదంచు రాహువిద్వేపేంద్రమున్న ◆ నెంచిపట్ట

గ్రమ్మని కేసరికిశోర ♦ కాంతిఁగాంచి
భీతిమై సైంహికేయుండు ♦ బెల్లరచుచు॥ 29

మ॥ త్వరతోన వచ్చెఁ బవాసివాసవుని చెం ♦ తం జేరి తద్వార్తలా
పురుహూతుండరుదంద దెల్పనతడా ♦ పుత్రుల్ దిక్పతుల్ కూడరా
స్వరుహస్తుండయి నాల్గుకొమ్ములమదే ♦ భంబందు నారోహుడై
సురలిర్వంకల గొల్వవచ్చె నటకున్ ♦ సు [illegible] తాపాస్యుఁడై॥ 30

ఉ॥ ఈగతి వచ్చి తమ్మిచెవి ♦ కీవల రెండవ చాయరాయఁడో
నాగమె లంగునీప్లవగ ♦ నాయకుఁ గన్గొని కొమ్ము తేనుగుం
బైఁగవియించి దిక్కటులు ♦ బ్రద్దలుగాఁ బటుసింహనాదముల్
వేగమ జేయు నీఘనుడు ♦ వేగమయాంతసవీడియు గ్రుడ్డై॥ 31

క॥ పండువిడఁబండుదొర కెదు బండువుగా నాకు నేడు ♦ వహ్వాయని పా
పండున వ్రుటనది దెల్లని పండువుగా నెంచి గారు ♦ పైకిం దుమికెన్॥ 32

క॥ కేసరికొమరుఁడు నిర్జర కేసరి కొమ్ముల మెకమ్ము ♦ గెరలుచుఁ దాకన్
వేసరి సితకరిదానిది యేసరియని పాఱెఁ బాఱ ♦ నింద్రుండటకున్ 33

ఉ॥ తెల్లని గారుపైకురుకు ♦ ధీరవరేణ్యుని పీని నేవిధిం
గల్లని గెల్చుటద్భుతన ♦ కైఁగల వజ్రముఁ దీసి వేసినం
బిల్లని చెక్కుఁ దాకుటయు ♦ బెట్టుగ నీతనిగుండె లెంత యేన్
ఝల్లని కూర్చు కొండఁబడె ♦ సారెకునుబ్బఁగ సైంహికేయుఁడున్ 34

హనుమంతుఁ డింద్రవజ్రహతిమూర్ఛిల్ల వాయుదేవు
డాత్మమూర్తి నుపసంహరించుట.

ఉ॥ పడ్డకుమారుగాంచి కడు ♦ వందురు చంద్రుని దూరుచాతడీ
బిడ్డకు జేసినట్టిపనిఁ ♦ బెట్టి మనమ్మున లోకమంతటం
జడ్డన నాదురూపు నుప ♦ సంహరణంబొనరించి వెంటనే
బిడ్డను దోడికొంచుఁ జని ♦ పెట్టితి గోత్రగుహాంతరంబునన్ 35

వ॥ ఇట్లు లేను గుమారుసింగూడి గుహనుండినంత 36

సీ॥ వ్రేలిమియాజకుల్ ♦ వ్రేల్వఁగాఁ జూచిన
చేతులుఁజూచిన ♦ రీతినుండె

వేల్పులులేపదా • న్లేచుదివ్యవి
మానముల్ లేచిన • మాద్రినుండె
మునికదంబముష్న్నన • మునకునీటనుముంచు
నంగముల్ ముంచిన • యట్టులుండెఁ
బశుపక్షిమృగముఖ • ప్రాణిలోకముభూమి
బెట్టుమంగుల్ బెట్టి • నట్టులుండెఁ
బ్రామినుకుఁబెట్టెనొకచోట • బాదుకొనియె
వేదపాఠముల్ జరుగక • భేదపడియెఁ
జాలఁగాలోకమెల్లగ • గ్గోలుపడియె
నాదుమూర్తినుడుపవెత • బాదుకొనియె॥ 37

ఉ॥ మెండుగలోకముల్ మిడుక • మిన్నికవానినిదొట్టివేలుపుం
దండునుజోగిపిండును ప • దంబులుపాణులుప్రేళ్లుకీళ్లునుం
బెండువడంగఁదిన్నగ • మెట్టగరాకనునెట్టకేలకా
యండభవాశ్వత్థోడదమ • యాపదదెల్పఁగనేగిరెల్లరున్॥ 38

వ॥ ఇట్లేగి 39

తే॥ కాలుసాగకనెల్లెట్లో • నేలకొఱగి
మ్రొక్కఁజాలప్రయాసమై • మోములెత్తి
ఫాలమునగట్టసాధ్యాన • గెఱదోయి
జేర్చెలుగురాకవేల్పుల • జియ్యకనిడి॥ 40

శా॥ వాణీనాథ! సృజించిలోకముజగ • త్త్రాణుఁజగత్త్రాణుగా
రాణన్నిల్పితివాతఁడేలోకొ జగ • త్త్రాణమ్మునార్పంగనీ
ప్రాణిశ్రేణులకార్యనిర్వహణమొ • ప్పంగాకపోయెం జగ
త్త్రాణుంగ్రమ్మరనిల్పవేకరుణ నీ • బన్నంబువారింపవే॥ 41

ఉ॥ నావుడుబ్రహ్మవల్కు సుర • నాథులకోసురలార! యంజనా
దేవికిసార్వదరస్థశివ • తేజమువాయువొసంగబుట్టె స
ద్భావుఁడువానరుండొకఁడు • వాఁడుప్రభాతవిభాకరున్ క్షుధన్
వావిరిపండటంచుజని • పట్టినయంతనవచ్చెరాహువున్॥ 42

సీ॥ వచ్చినక్రోధుఁడై ♦ వానిఁదాకఁగఁబోయి
వాఁడెదిరింపఁగా ♦ వారివ్రాయి
లేఖర్షభుని జేరి ♦ లెమ్మికేమున్నది.
రవిబట్టెననుదోలి ♦ పవినిభుఁడాక
డన్నసితేభమ్ము ♦ నతఁడెక్కివచ్చిశ
తారమ్ముగొనివాని ♦ దాకసేయ
నదివానరునివాము ♦ హానువ్రదాకినవాఁడు
మూర్ఛిల్లిపడియెదూ ♦ ర్పుమలపైని
శైలమునబడ్డబిడ్డను ♦ చంకబెట్టి
గుహానుదూరిస్వమూర్తిని ♦ గుంచెఁబవనుఁ
డింద్రుపైఁగిన్కనద్దాన ♦ నింతపుట్టె
"కాకిబిడ్డకాకికిముద్దు" ♦ కాదెచెపుడ॥ 43
క॥ వాయువత్రిజగత్ప్రాణము
వాయువత్రిజగద్బలమ్ము ♦ వాయువఖిలమున్
వాయువధికుండుదివిజుల
వాయువచరియించునెల్ల ♦ ప్రాణులయందున్॥ 44
ఉ॥ కావుననామహాబలుని ♦ గ్రక్కునఁబ్రార్థనసేయనిప్పుడే
పోవలెరండటంచురహి ♦ బూర్వనగమ్మునుజేరితద్గుహన్
ఠీవినినిల్వవచ్చితమిడె ♦ క్కునీకుమారుతోడ నెం
తేవినయమ్మునంగొమరు ♦ నిందగమ్రొక్కఁగజేసి యూపయిన్॥ 45
ఆ॥ నేనుమ్రొక్కనిల్వ ♦ గానల్వయునుసీదు
కానుపేదియితఁడ ♦ కాదయంచు
వాణిచెక్కుఁపీటు ♦ పాణిమవ్వఁగలేచెఁ
బట్టివానవాడు ♦ పైరువ్రాలె॥ 46
వ॥ ఇవ్విధంబునంగాంజరీగర్భశుక్తిముక్తాఫలంబు మూర్ఛదేఱియున్నంత
ఆ॥ పద్మసంభవుండుపట్టిని ♦ దొడపైని
బెట్టిచుంచుదువ్వి ♦ ప్రీతిముద్దు

లాఘుచుండెయంత • వేషుకమూర్తి
వెలిచి ప్రజకుసుకము • గలుగ జేసె॥ 48

బ్రహ్మాదులాంజనేయునకు వరంబులొసంగుట.

మ॥ పవనున్నన్నలరించిపద్మజుండుదే • వశ్రేణిశిక్షోనిట్లను౦
దివిజవ్రాతములార! యీకపివరుం • దీవించివేవేగ నీ
మువరంబుల్ కృపసేయుడీప్లవగచంద్రుండోర్చిదైత్యావళిం
దివిజశ్రేణికినెంతొమేలొసగెనుం • దివ్యత్వతాపాఘ్యులై॥ 49

వ॥ అనినవేల్పు పెద్దపలుకులాలకించి యెల్లవేల్పులు వల్లెయని పల్కుటయు 50

క॥ తనవజ్రముహనువునదా
కెనుగావునహనుమదాఖ్య • కేకనువజ్రం
బునసింకనెపుడునొవ్వం
డనుచువచించె బురుహూతుం • డాదటమెచ్చన్॥ 51

సీ॥ ఆత్మదండమ్మున • నాత్మాస్త్రముననొవ్వ
బడకిభవ్యాయువు • బ్రహ్మయిచ్చె
నాత్మశూలమ్మున • నాత్మాస్త్రములనొవ్వ
దడసిభావమ్ము • మృడుడొసంగె
నాత్మపాశమువ్యస్త్ర • వాత్మదండమ్మునె
వ్వం జేయవనిసను • వర్తివల్కె
నాత్మతేజమునశ • తాంసమ్ముచిద్యలి
వ్వంగలననిగ్రహ • భర్తవల్కె
నాత్మపాశాంబువులనొవ్వ • డనియెవరుణు
డాత్మశిఖలనశించడం • చనియెనగ్ని
యాత్మగదబడడనెశీదు • డఖిలశస్త్ర
కాండములద్రుంగడనివిశ్వ • కర్మపలికె॥ 52

క॥ ఒక్కొక్కవేల్పునవ్వల నొక్కొక్కవరంబువేర • నొసంగగనాతో
నక్కనకగర్భుడిట్లనె నక్కడిజేజేలుజోగు • లందఱువినంగన్ 53

పంచచామరము. సదాగతీ! భవత్సుతుండు ♦ శౌర్యధైర్యధుర్యుఁడా
పృథానువైరివాహభర్త ♦ బృందవంద్యమానుఁడ
ల్లదానవేంద్రురావణుం గ ♦ లంచిమించు జానకీ
ముదాశ్రయుండు రామకార్య ♦ ముద్ఘటించుముందికన్ ‖54

క॥ అనిమత్కుమారునింబోఁడ గనివత్సా! నీకుముజ్జ ♦ గంబులనొకఁడుం
గనసాధ్యము కాసిది లే దనఁగాదు వేమున్న దంచునబ్జజుఁ ♦ డరిగెన్॥ 55

ఉ॥ అంతటనాత్మజాతునకు ♦ నైదురపిల్లుచునున్న కౌంజరీ
కాంతకునప్పగించిసుతు ♦ గ్రక్కున నేనరుగంగనీతఁడా
చెంతలనుండుసన్మునుల ♦ చేలములాదిగ వ్రచ్చివారివా
స్వాంతములంగలంపగని ♦ వారలుసక్రుధ శాపమిచ్చినన్॥ 56

క॥ ఆపట్లనితఁడుపశ్చాత్తాపముగనునొందిదోఃప్ర ♦ తాపంబొకరుం
డేపలుక దెలియుచునువల లోపలబడ్డపులిభంగి ♦ లొంగిచరించెన్॥ 57

హనుమంతుఁ డర్యమునొద్ద వేదశాస్త్రాలుచదువుట.

ఉ॥ ఆదటనొక్కనాఁడితఁడ ♦ హాస్కరుఁడిచ్చువరంబుదల్చి స
మ్మోదతవిద్యలంగఱవ ♦ బుద్ధినెంచిదినేశుజేరి యొం
తేఁదనువచ్చుకారణము ♦ దెల్పి నమస్కృతిసల్పగానతం
డాదరణంగనుంగొనిము ♦ దాన్వితుఁడై వటుగూర్చియిట్లనున్॥ 58

ఉ॥ పావనినాకడంజదువ ♦ వచ్చితివ్రాసకలాగమంబులం
ద్రోవనెటభ్యసించెదుక ♦ చుంగొనముందరనిల్వరాదుగా
నేవఁడిగానటుంగగను ♦ నీమనమొక్కటిగాగనిల్చునే
యీవిధమెల్లనీయెడద ♦ నెంచివచింపుమునీవునావుఁడున్॥ 59

సీ॥ వికసితవదనార ♦ విందుఁడై వడుగుపూ
ర్వాద్రినొక్కఁడుగు న ♦ స్తాద్రినొక్క
పాదంబునిడిమధ్య ♦ భాగంబునం దేహ
మును బెంచెను ద్రివిక్ర ♦ మునకుసరిగ
నదిగాంచిలోకమ్ము ♦ లడలెఁదత్కర్మసా
క్షిముదమ్ముమనమున ♦ జెందెనంత

ంజరూపుననుబద్మి • నీవల్లభునితేఁ
కెదురుగాఁదానిల్పి • చదలుతెరువు
నందునవడిగానఱుంగుచు • నాగమమ్ము
లాదిగావిద్యలెల్లఁదా • నభ్యసించె
గ్రహణధారణశక్తికా • గ్రహపతితన
డెందముననుబ్బునబ్బురం • బొందుచుండ॥ 60

క॥ కడుపాఱఁగుడిచినీడను వడుఁగుగుఱుంపుదెలుపఁజదు•వడునిపుడిలలో
గడుపాఱఁగుడువకొండను వడుఁగుగుముడుదెలుపఁజదువఁగఁగలిగెంభళీ!

క॥ మేటిగఁదావిద్యలలో బేటిగఁదాగుణమణులకు•పృథివీస్థలిలో
సూటిగనఁనితనికేవఁడ సాటిగఁదాఋక్షవిరజ! సారస్వతిజా॥ 62

వ॥ ఇట్లెల్లవిద్యలంగఱచి కుమారుండున్నంత నిటకేనుదోడ్తెచ్చితి 63

ఉ॥ కావునవీనినీవుగొని • కావుమునీసుతులట్లప్రీతిమై
నీవునుసేకొమాళ్లునవి • నీతినిజూడకుడీకుమారు సు
గ్రీవునకాప్తమిత్రియగుఁ • గృత్తవిరోధియునౌనుముందుని
తావుననుంపుమీఘనుని • వప్పకసల్పుబహూపకారముల్॥ 64

వ॥ ఋక్షవిరజుండెంగట నిటుగుమారునించి సమీరుండుజనుటయునంత

క॥ ఒకనాడాతరుచరమణి సకలవనేచరులుగొలువ•సభదీరిస్వాం
త్రికదంబమునర్మిలిఁగని ప్రకటంబుగనిట్టులనియె•బ్రాజ్ఞులుమెచ్చన్॥

ఋక్షవిరజుఁడుగ్రసూనురాజుఁజేసి తపంబునకేగుట.

శా॥ మంత్రివ్రాతములార! మజ్జనకుఁడం • పన్వచ్చికిష్కింధ స
న్మంత్రివ్రాతముగొల్వవృక్షచర సాం • బ్రాజ్యంబునేవానిదు
స్తంత్రంబుంజోరనీకసల్పితిని ని • చ్చంబెద్దకాలంబు స
న్మంత్రంబుంజపియించుటొప్పు సుతుసాం•బ్రాజ్యంబునన్నిల్పఁకన్॥ 67

ఉ॥ పొందితినెల్లసౌఖ్యములఁ • బూసితిఁగట్టితిఁదొడ్గితిన్సిరిం
బొందితిఁబుత్రులంగంటిఁ • బుత్రులుబుత్రులనెత్తగంటి నిం
పొందితి వెంట్రుకల్ నరిసె • నోపికదగ్గెను బంధ్లునూడె నీ
బొంది తిరంబుగాదుగద • పొందెదవిష్ణుదలంచితత్కృపన్॥ 68

ఉత్సాహము. కావునంగుమారురాజు • గాఁగనిల్పి రాజ్యముం
బ్రోవుమంచుదపమొనర్ప • బోదునేనుదీనికిం
గానఁబసినవస్తుసమితి • గ్రచ్చురంగణించిమీ
రావలన్మహార్తమొక్క • డరయుడంచుబంచినః 69

ఉత్సాహము. ఃవివాహవస్తువులఘు • టిల్లజేసి ప్రాజ్ఞులెం
తేవిధించిపల్కినాడ • నేటయినదినంబటం
చావిధిసుతుఁ"దగ్రసూను"నాత్మగద్దెనిల్పెబల్
ఃవిప్రదీవనల • లింజెలంగఁ బ్రీతిమై॥ 70

క॥ ఆవెనుకజిన్నిదొఱసుగ్రీవుని"యువరాజు"జేసి•గీశమణినిన
"ప్పావని నెచ్చెలి"గాగను మీావనియాజ్ఞనిడివసికి•నేగదలఁచితాఁ॥

వ॥ పావనిసహితులయిన కుమారులంజేరి యందుపావనులయిన హను
మత్సుగ్రీవులు వినసగ్రనందనుండగు వాలికిట్లనియె. 72

క॥ ఒండాడుముకలనైనను రెండాడుములుచను బట్టి• రేపనకపుడే
చెండాడును పెద్దలగని కొండాడుముపూజసల్పి•కూరిమిపుత్రా!॥ 73

సీ॥ కనదలంపకుపర • కాంతను నెన్నండు
కనదలంపుముపర • కాంత నెపుడు
వినదలంపకసత్య • ముగు జెవి నెన్నండు
వినదలంపుముసత్య • మునుసతంబు
జనదలంపకుదుష్ట • జనజాడ నెన్నండు
జనదలంపుమునిష్ట • జనులజాడ
మనదలంపకురిక్త • జనగోష్ఠి నెన్నండు
మనదలంపుముభక్త • జనులగోష్ఠి
మనుపనెంచకుదప్పున్న • ననుజునైన
మనుపనెంచుమదప్పున్న • మన్ను వేల్పు
బళిర యిటువంటిరాజుగా • నలయుజుమ్మి
కేల్లపుడటంచు బ్రజలాడ • నేలుమువని॥ 74

చ॥ వదలఁగనీకునూర్పదులు ♦ వచ్చినపోయినసత్యవాక్యముఁ
మెదలఁగనీకుమిన్నొరగి ♦ మీఁదనుబడ్డనధర్మపద్ధతిం
గదలఁగనీకుశాస్త్రజన ♦ కమ్మగుసాఙ్ఖ్యకపిప్రముఖ్యులం
బొదలఁగనీకుదుష్టరిపు ♦ భూములనెల్లపుడీవుపుత్రకా!॥ 76

క॥ ఆయమునకుదగినట్టుగ ♦ జేయుమువ్యయమెపుడు నీవుశిష్టులగన్నం
డాయుమువారికిదానము, సేయుమునీకున్న దాన ♦ శివుజెందుమదిఁ

క॥ రాదుజర లేదుమృతియని, పాదఃకొలిపిమదినిరెంటి, బడిబడిగొనుమీ
నాదుతలనీడ్చికొనితాఁ, బోదొరగె నమృత్యువంచుబుచ్చెమొకంఠుఁ

ఉ॥ పోడిమిగొన్నినీతులిట్లు ♦ పుత్రులకుం దెలియంగ జేసితాఁ
బాడిమెలంగుమంచునల ♦ పావనికిందగదెల్పి, యెంతయుఁ
వాడిమినేగెధాతృజుఁడు ♦ భర్మనగమ్మునకుందపంబుకై
కూడిమెలంగిరైంద్రియును ♦ గుంజరపౌత్రుఁడునర్కియాదటఁ 79

క॥ తలలో ♦ నాలుకవలెబూ,సలలోదారంబుపోలె ♦ జక్కనువురుబె

[వాలిసుగ్రీవులు తపంబున కేగుట]

ద్దలలోనమ్రతగపిబల,ములలోఘనతనుమెలంగి ♦ పొగడతగనిదా 80

శా॥ ఇంద్రార్కాత్మజులంతనొక్కదినమం ♦ దీశానుబంచాననుఁ
సాంద్రామోదమునన్భజించితమవాం ♦ ఛల్ దీర్చికోనెంచిని
స్తంద్రప్రక్రియమంత్రిసత్త్ములపై ♦ సామ్రాజ్యమున్నిల్పిత
త్సాంద్రస్థైర్యులుశీతశైలమునకు ♦ త్సాహమ్ముమైనేగిరా 81

మ॥ చనితచ్ఛీతనగమ్ముపొంతనొకచో ♦ స్నానాదికృత్యాళిఁదీ
ర్చినిరాహారులునైకుశాసనములం ♦ జెల్వారఁగానిల్చిభ
క్తినిలింపార్చితపాదపద్మయుగళుం ♦ దీప్తాగ్నినేత్రుందయా
బ్ధినిభక్తావనదక్షుయోగిజనహృ ♦ ద్ధ్యేయుఁ శివుంశంకరుఁ 82

(శివుఁడువాలిసుగ్రీవులకుఁ బ్రత్యక్షమై వరంబులొసఁగుట)

ఉ॥ నెమ్మదినిల్పిధ్యానముసు ♦ నిశ్చలబుద్ధినిసల్పిసత్తపం
బిమ్ములనొక్కవత్సరము ♦ నెంతయుజేయశివుండుమెచ్చిమో

దమ్మునవచ్చెఁదత్కపిసు ♦ ధాకరులుండినచోటికిఁగతిం
బొమ్మికనేలభక్తసులం ♦ భుండనజంద్రధరుండవేల్పులన్ 83

మ॥ ఒకచాయంబ్రమధప్రవజంబనయుమ ♦ త్యుల్లాసతంగొల్వవే
రొకచాయన్మఘువాదిద్రిగమణము ♦ ఖ్యుల్ భక్తి సేవింపగొం
డొకచాయన్మునిముఖ్యులెల్లనిగమా ♦ ర్థోక్కుల్ ప్రశంసింపనిం
కొకచాయంద్రిదశాబ్జపత్రనయనల్ ♦ ప్రోద్యద్గతింబాడగాన్ 84

క॥ బంగారుమువ్వపల్లముఁ బొంగారుసువర్ణశృంగ ♦ ములుగై సేయన్
రంగారుగిత్తతత్తడి సింగారముగులుఁకనెక్కి ♦ చెలఁగెడువాఁడున్

క॥ తలజాలునొల్లదోలు న్నలప్రోలునొన్నలవాలు ♦ మంచఁపుగోడుం
గలకేలుజందుజాలం దలపించెడుడాలుగలిగి ♦ తనరినవాఁడున్ 86

సీ॥ ధరణీరధమువాఁడు ♦ దరబృందశరబృంద
వరకుందసదృశసుం ♦ దరమువాఁడు
స్మరణీయుడగువాఁడు ♦ స్వరుధారి
శరదాభ్రధరధారి ♦ గొలువగాదగినవాఁడు
గరినిద్రుంచినవాఁడు ♦ హరిచెల్లిసిరితల్లి
దరిబెల్లి ♦ దపుగుల్కదనరువాఁడు
ఖరునినొంచినవాఁడు ♦ గరమందుశిరమందు
హరిణేందు ♦ లధరించియలరువాఁడు

దచ్చిరూపులవాఁడు ♦ ప్రాఁతమగవాఁడు
బొడలదుప్పటివాఁడుబెం ♦ జడలవాఁడు
పేర్మిఁగలవాఁడుబుస్కల ♦ పేర్లవాఁడు
త్రోచెఁగపివరులకుముందుఁ ♦ బూచిజేఁడు 87

వ ఇట్లు సాక్షాన్నిటలాక్షుండు క్షోశ్వాకోహాణుండయి సాక్షాత్కరింప బుక్షువిరజాత్మజులారక్షోవైరివీక్షించి రక్షురక్షేతివాక్యంబులనిట్లని స్తుతియించిరి.

"వాలిసుగ్రీవకృత శివస్తవమ్,,
కందద్వయగర్భిత నిరోష్ఠ్యసర్వలఘు
సీసము.

శ్రితజనహితకర! శితిగళ!నతహిత! నగధరశర! హరి ♦ ణధర! గిరిశ !
హతగజ! శశిధర! హర! ధృతిజితధర! సిరిగలధణి చెలి! క్షితిగ!సనయ!
హరితనయహరణ!హరిహయకరి,హయ;ఘనయశ!శిఖరిజ♦కలిత!సదయ
శరధిశరధి! ఘన ♦ చరిత! శిఖరిగృహ! ఖలజనహర!యహి ♦ కటక
ఆ॥ వె॥సరసహృదయ త్రిదశ♦జనహితకరహరిసనకజనకధనద♦సకల త్రిదశ
నతచరణసరసిజ! ♦ కృతిహితకర! శిఖినయన! త్రిదశశరణ!♦ సరళహిరణి
[ఈ క్రిందిపద్యములోఁ బెద్దయక్కరములు చదువఁ గ్రంథకర్తృనామ]
మేర్పడు

సీ॥ శ్రీభవ!శుభాకార! ♦ యాశ్రితోద్ధార!దు
ష్టారాతిసంహార! ♦ యగవిహార!
వరభక్తమందార! ♦ వారాశిగంభీర!
ధామనిర్జితస్మార! ♦ దైత్యమార!
న్యస్తాహివరహార! ♦ నగధీర!శారదా
బ్బయసమశారీర! ♦ భయవిదూర!
రాజకళాధార! ♦ రతిరాజదార!సం
జుషువిండి తెగసూడ! ♦ శుభవిచార!
హతకటపహార!గజదైత్య ♦ హర!భాను
మండలవిహారశరధార ♦ సుహితభూత
రాజితప్రేతభూవిహా ♦ రమునినాయ
కనుతగుణవారప్రణుతప్ర ♦ కరసురగవి 90

ముక్తపదకందము

స్థేమాభిరామ! ♦ సోమా!సోమార్ధధరాభువనగ! ♦ సురరిపుభీమా!

భీమా!దుర్గాకామా! ♦ కామారీ!కాతరోప ♦ కారి!నమస్తే 91

గోమూత్రికా బంధము.   నిరోష్ఠ్యకందము

శ్రీనగనాథా!రాధా ధీనసఖా!రాజధార!♦ ధీరనతాజా!
దీనజనాధారా!కంధీనసవారాక్ష్య!ధాత్ర్య! ♦ ధీననతాజ్య 92

ఆందోళికా బంధము.

క॥ ధీరవరదాయకా!కంధీరవహాయనాయకాగ్ని ♦ నేత్రక!గంగా
ధారాధర!గోరథ!రాధారతసఖచంద్రఖండ ♦ ధర!హార!వరధీ! 93

ఛత్రబంధము   శుద్ధాంధ్రనిరోష్ఠ్యచంపకము

కడకడతేఁడ!జింకగయి♦ గల్గఁగ!గ్రాలోడయండ!దండనా
లడరోడయండ!యొండనక ♦ నల్లనజేదోగినాగిత్రాగినా
తేఁడ!జడలాడగంగదగఁ ♦ దద్దదసర్చతేఁడా!తనంతనై
యడరోడయండ!యెన్ననల ♦ నన్ననసేల్నయ!రాయ!నాయనా! 94

నాగబంధము.

చ॥ శ్రితహిత!భూతనేత!క్షితి ♦ చింతిత!రక్షితకోణనేత!సం
తతవరదాత!భూతకర ♦ నారదవర్ణిత!నాగహార!ప్రాం
చితగుణవార!భూతదర! ♦ శ్రీరతిరక్షిత!భూతభావనా
సితనగజాతనేత!శివ ♦ సేవనతత్పర!క్రూరమారకా! 95

ఖడ్గబంధము.

క॥ సారతరధీరమాకర!పారదరమణీయకాంతి ♦ భాసురదేహా!
హారివృషరాజివాహా!దారితశుకవాహా!జన్మ♦దాహా!నిరీహా 96

శైలబంధము.

క॥ శ్రీకమలాక్షీహృత్పద్మాకరరవికీర్తనీయ!♦హతభయ!రతిరా
డ్భీకర!సునయ!దయాకర!శ్రీకర!సకలసురముఖ్య!♦కృతిముఖగేయా!

చక్రబంధము.

శా॥ రక్షోశిక్షణదక్ష!దక్షసవనా ♦ రణ్యోగ్రదావాగ్ని!సం
రక్షాంభోరుహసంభవాండ!సకాలామర్త్యార్చి ♦ తాంఘ్రిద్వయా!

కుక్షిక్షిప్తమహాజగద్విసర! య • క్షుద్రోజ్జ్వలన్మానసా!
సాక్షాత్కారద! వారభగ్నకుజనా • సంస్తుత్యయోగ్యాంభసా! 98

ప్రపంచవర్గీయ కందము.

శ్రీవిశ్వేశ్వర! శైలో ర్వీవాస! శివాసహాయ! • విషసంహారా!
శ్రీవృషవాహారోహా! శ్రీవరసంసేవ్య! శర్వ! • శివ! శూలి! హరా 99

అచ్చాంధ్ర నిరోష్ఠ్యకందము

రేరాజాడాల్ • రాజేజేరాజాడాలజిరిని • జెన్నారెడిరాయా
కోరానెచ్చెలి • కాడా రారాతంక్రీగిత్త • డాల్ రాజేజే 100

దండకము. శ్రీపార్వతీమానసాంభోజహంసా! నిశాధీశ ఖండావతంసా!
ప్రసేవ్యాబ్జభూ బర్హిబర్హావతంసా! లసద్ధృక్కృతాబ్జాగ్నిహంసా!
సమస్తాఘవిధ్వంస! గీర్వాణులుం బూర్వగీర్వాణులుం బాలసం
ద్రంబు భాండంబు శైలంబు కవ్వంబు నాగేంద్రు నింద్రాడు
గా జేసి ద్రచ్చంగ దొడ్డార్తి లోకంబు పెల్లాకులంబొంద ఘో
రార్భటిం జేదువుట్టం బినాజాదిదేవాళి వేడం గరంబందు నేరేషు
బం బుంబ తెంగట్టిగా బట్టి కత్తాలకూటంబు నుద్రింగ వ్రామింగి యీ
రేషులోకాలు లోకాలు నంచట్టితోల్యుష్మల రాజూల సారార
గా గుత్తుకన్నిల్పవా! లోకముం గూర్మిమై దేల్పవా సర్వసర్వంసహాచక్ర
మర్కేందుచక్రంబులం బండిగా వేదముల్ గుఱ్ఱపుంబిండుగా
బ్రహ్మసూతుండుగా వేలుపుల్ దండుగా గొండసింగాణిగా
గుండలీంద్రుండు బెన్నారిగా నమ్మనంతుండుగా సంద్రముమ్మల్
పొదింగా దగం జేసి బెన్నిక్కమైపోయి ముప్పోళ్ళు దున్మాడవా
వెన్కగోపమ్ము నుస్విడవా ముమృకండాత్మజుండొక్కండుం
బత్తి నిన్మానసంబందు ధ్యానం బొగిం జల్పుచుండంగ గాలుండు
బొందున్న పైనెక్కి వేవచ్చి పాశంబునన్ దండగిల్చిడ్వ లింగం
బునం బుట్టి డాకాల నాకాలునిం డాచి భూదేవు పట్టిం బొరింగా
నవా దేవదేవా మహేచ్ఛం గృపం దీర్చి నీదాసులన్మమ్ము రక్షిం
పు రక్షింపు రక్షింపు దేవా! నమస్తే నమస్తే నమస్తే నమః 101

సీ॥ భువిస్థిరమై చరాచరం • బుల భరించె నెవండు జలమై దగం బాలె • లలి నెవండు
శిఖియై మహాంతమ్ముఁ భుజింపఁగ లైనెవండు మరుత్తై తెలివినిడె • మహి నెవండు
దివిస్థిరమై పథంబిడె • దివిజులకు నెవండు విధుఁడై భగణము నేల • వెస నెవండు
రవియై తనుచ్ఛ్రాయ • లవిరియించె నెవండు యజ్వయై వ్రేల్చుహ • వ్యంబె వండు
నజుని యుంచును బరమాణు వందె వండు
నుంచు భేదంబు లేకని • త్యుండె వండు
నాదిమధ్యాంతరహితుండు • నగు నెవండు
నాశివంకఁ గుడవు సీవు • నౌదు మెందు 102
మధురాక్కర. స్మరహరణ! సజ్జనవిచార! • సంసృతిభారహార!
దరహరణ! తారధరధీర! • దారుణపాపహార!
నరశరణ! నైగమవిహార! • నాకపవైరిమార!
వరకరుణ! వైరిజనదూర • వర్ణితగోకుమార! 103
తోటకము. శరణాగతవత్సల! • చంద్రధరా!
కరుణాకర! శంకర! • కామహరా!
ధరణీధ్రధనుర్ధర! • దైత్యహరా!
స్మరణీయతమోజ్జ్వల • మంత్రపరా! 104
క॥ వాలియు సుగ్రీవుండును జాలి యొదవ జల్పినట్టి • స్తవమున కెంతే
కాళీయువతీశుండగు వాలియు మదిలోన మిగుల • బొక్కి యిటులనుఁ
క॥ ఓకోమారులార యీరలు నాకై సలుపుతపము • నకు మెచ్చితిమీ
మీ కోరిక లెఱిగింపుఁడు నాకోలదివరమ్ములిత్తు • ననవుడు వేడ్కన్
వ॥ అంత నవ్వాలి సుగ్రీవు లిట్లనిరి 107
ఉ॥ ఓమహితప్రభావ! యొరుం • డొక్కఁడు మాపయి కెత్తివచ్చినే
నామహితప్రతాపుబల • మందు సగంబాగి మమ్ముఁ జెందున
ట్లీమహితావకాంఘ్రిపయి • నెప్పుడుభక్తి ననుగ్రహించి దు
ర్గామహిళామనోంబుజవి • కర్తన! కావుము సాదరమ్మునన్ 108
వ॥ అనవుడట్లు కాఁగలదని పల్కి దివిజసేనాపరివృతుండయి మృడానీశుం
డంతర్హితుండగుటయు వాలిసుగ్రీవులు లబ్ధమహేశ్వర వరప్రసాదా

మోదులయి నిజపురంబునకుం జనిసుఖంబుండిరంత నొక్కనాఁడు

(రావణుఁడింద్రజుఁడయి దండెత్తి వచ్చుట)

శా॥ పౌలస్త్యాన్వయవార్ధిచంద్రముఁడుగీ ◆ ర్వాణాభియాత్యన్వవా
యాలంకారుఁడు రావణాహ్వయుఁడులం ◆ కాధీశ్వరుం డుగ్రప
త్కీలాలోద్భవమత్తషట్పదముల ◆ క్ష్మానాథవైరుండు శౌ
ర్యాలంకారుఁడు దైత్యశిల్పితనయా ◆ స్యాంభోజమిత్రుం డొగిన్ 110

శా॥ ఆశాధీశుల నొక్కఁ డేగెలిచెము ◆ న్నంతంతనమ్మాద్రిగాఁ
గీశాధీశుని వాలిఁబోరఁగనుగి ◆ ష్కింధాపురిం జేరి త
త్కీశాళుల్ దనుమూఁగిచూడఁగనుది ◆ గ్వేదండముల్ గల్గనా
కాశంగొట్టికవాకిటంబులికిదీ ◆ క్షైబిట్టుగర్జిల్లినన్ 111

క॥ ఆరావముకీర్తివిజిత తారానరతారుఁడైన ◆ తారుఁడువినిప
ల్కోరావణ వల్కుమునీ వీరావమునకుఁ గతము ◆ నెఱుకపడంగన్

వ. అనిన తారునకు రావణుండిట్లనియె. 113

క॥ వాలియసమానవిక్రమ శాలియనంగవిని నేను ◆ సమరక్రీడా
శాలినగుటవచ్చితిఁద త్కేళికినతనినెదిరింప ◆ తెల్పవిధమున్ 114

చ॥ అనవుఁడు రాక్షసేశ్వరున ◆ కాతఁడు వల్కు సురద్విషేంద్రతత్
ద్వినుతబలాఢ్యుఁ డేడ! భవ ◆ దీయబలమ్మది యేడ! నీకునా
యనఘునకెన్న హస్తిమశ ◆ కాంతరమున్నది తారతమ్యమె
గనుగొనవానిదాకు మొన ◆ గాఁ డెంకఁడీవర కెందునీభువిన్ 115

ఉ॥ ఆశరనాథ! యీవరకు ◆ నాతనిదాకినవాఁ డొకండునే
నాశమునాలయమ్మునకు ◆ నైచనకట్టిఁడు లేదునీవున
ట్లాశలనన్నిటిన్విడచి ◆ నట్టులుదో చెడుపొమ్మ వాచివా
రాశికిస్నానకృత్యమొన ◆ రంజలుపంజనెవాఁడు వెండియున్ 116

సీ॥ ప్రకటశాత్రవగర్వ ◆ పర్వతచ్ఛటపక్ష
పుంభజగోన్నగ్రదం ◆ భోళివాలి
వికటదానవదైత్య ◆ వేణుశుష్కారణ్య

పాళిదాహకదాన ♦ కేలివాలి
నికటవైరిసమూహ ♦ నిర్భేదనైపుణ్య
చణవికసితబుద్ధి ♦ శాలివాలి
ప్రకటరిపుచ్ఛటా ♦ భయదప్రతాపాగ్ని
కీలాద్రివిజితాంశు ♦ మాలివాలి
యట్టిమతిశాలివరకేళి ♦ యైనవాలి
సమరపాళికినేనిసుం ♦ తైనదేరి
కనఁగరాదనదలపగాఁ ♦ జనునెమొరుల
దానికేమిచనుము నింద్ర ♦ తనయుకడకు 117

క॥ బవరమునకుఁబారందరి సవరనిహాంం దేరినెక్కి ♦ సాగినజేజే
లొవకంటు లెడమకన్నుం దోవలదఱుంగా దెరావ ♦ ణుండిదివినఁడో!

క॥ అనుచున్న తారుగర్వం బునగనిపదినోళ్ళత్తెన ♦ వృచురావణుఁడ
వ్వనిచారిదూరివేగంబున దక్షిణవార్ధిజేరి ♦ మొగిఁదానిదరిఁ 119

సీ॥ జలములగ్రుంకిని ♦ శ్చలహృదిదర్భాస
నాసీనుడైనిల్చి ♦ నట్టివాని
సలిలపూరితతామ్ర ♦ కలశంబుడంబుమయి
సడరగాగుడిప్రక్క ♦ నిడినవాని
దలిరువెన్నెలలంతే ♦ దులదూగుస్వచ్ఛంపు
మడుగుగప్పినసగెం ♦ పుటోడలవాని
భూతిత్రిపుండ్రముల్ ♦ భూరిరుద్రాక్షమా
లలుదాల్చిమిన్నులఁజె ♦ లంగువాని
త్రిపద గాయత్రిమంత్రంబు జపముసేయు
చుమగకరగన్ను మోడ్పుణో నొప్పువాని
సూర్యభగవంతునకుభక్తిఁ జోబసలిడి
యుదయసంధ్యను వార్చుచునుండువాని॥ 120

చ॥ మఱియు దినాధినాథు బలె • మన్వఁగఁ దేజున నొప్పువాని జ
క్కఁ జప్పు బోఁడిదాల్పు విలు • కైవడి పెల్లగు మేనివాని బం
ధురతర బాడబాగ్నిగతిఁ • దోఁచెడు వాలము వాని యామ్య ది
క్తరుణ ప్రతాపతుల్యముఖ • తామరసమ్ముఁ గలాని వాలినిన్ ॥ 121

మ॥ కనిసామాన్యుఁ గొమ్మ ద్రిమ్మరిగ హృ • త్కంజంబునం దెంచి యైం
ద్రిని మాయాబలకౌశలంబునను దో • ర్వీర్యంబడంపంగ సా
నని వంచించి స్వపుష్పకంబుడిగి ముక్ • స్వామాత్యులం తంతఁ గ
న్గొని మెచ్చన్మహి మెల్లగా నిడుచు న • ద్గుల్ పొంతకుం జేరగాన్ 122

మ॥ అడుగుల్ చప్పుడొకింత విన్బడఁగనిం • దారిందృగంతంబులం
గడకం గన్గొని మాయఁదన్నుఁ గెలువం • గావచ్చె నంచైంద్రి లీ
డుడుగం డీఖలు నాల్గు సంద్రములముం • తొండొండగతుంబులం
దిడి సేనంచు మనంబునం దలచి యొం • తేనిష్టమైనుండఁగన్ ॥ 123

(వాలి రావణు గర్వంబడంచి పరిభవించుట)

ఉ॥ మెల్లఁగఁ గాలు నేలపయి • మెట్టుచు బశ్చిమదిక్కు జేరి యా
ప్రల్లదుఁ డెల్ల నెమ్మొయి ని • ప్రక్కకు నొత్తిగిలంగఁ జేసి మె
న్మెల్లన జేతులా ఘనుని • మీఁదికిఁ జాచిన నాతఁ డేనుగుం
జల్లగ బట్టు కేసరిపసందన • చంకల నొక్కి వానినిన్ 124

ఉత్సాహ॥ పాముఁ గాలఁ ద్రొక్కి పట్టి • పాఱు పక్కి రాయడ
ట్లాముగ్రుంగ రాక్షసేంద్రు • నంగకమ్ములన్ని టిం
దీమసమున నొత్తి పట్టి • దేవసిద్ధసాధ్యులీ
తామసునకు నిట్లు గాగ, • దగునటంచు నుబ్బ నా
భీమబలుఁడు వేచెదివికిఁ బట్టుపొల్కుఁ బుట్టునన్ 125

వ॥ ఇట్లింద్రుపట్టి విహాయసమార్గంబునం బడమటి కడలి దరికరుగుడంత
కుమున్న. 126

మ॥ స్తనితంబుల్ వలె బెబ్బులుల్ వలె బ్రహ • స్తాదుల్ మొగిల్ తెన్నున
న్జనువాలింగ ఘనడ్డగించి వెనుకం • దద్వాలజంఝానిలం
బునకుం దూలికలట్ల మేఘపటలం • బుల్ పొల్కుఁ జీకాకు వొం

దినభోమార్గమునందుదిక్కొకటై ♦ నిల్వంగ లేకేఁగిరా 127

క॥ ధారుణిరేణువుఁగొనిచను మారుతముంబోలె వాలి ♦ మాంసాశినిటుల్
జేరిచి పశ్చిమజలనిధిఁ బేరిమిమైమ్రుంకులాడి ♦ విధ్యుక్తముగన్ 128

ఉ॥ వాలి తదబ్ధియందుజరు ♦ పంగలసత్క్రియ లెల్లఁజల్పి తా
నైలబిలాశనుండిన మ ♦ హాబ్ధికి నేఁగి మునింగి, రావణుం
గేళిని జంకలందు నిఱి ♦ కించియు, బూర్వసముద్రనాయకుం
బాళిని జేరి, గ్రుంకులిడి ♦ భక్తిజపమ్మొనరించి తద్విధిన్॥ 129

చ॥ ఇటుఁజతురబ్ధులందు గృత ♦ కృత్యుఁడునై పురుహూతసూతి; త
త్కుటిలునితోడ వేగదన ♦ కొట్టికకుంజని; వానిఁదద్వనిన్
దటుకునజంకనుండి విడి ♦ తత్క్షణమెర్గనివాఁడపోలెనో
పటుజవ! యెడనుండిటకు ♦ వచ్చితి వేమని పల్కరింపఁగాన్॥ 130

శా॥ వీతాహంక్రియుఁడై, దృగంతములజో ♦ బ్బిల్లంగఁ బాష్పాంబువుల్
వాతాకంపితవృక్షమట్లతనువా ♦ పాదంబు స్వేదాన్వితం
బై, తూలందతభీతిఁ; గద్గదనినా ♦ దాన్వితుఁడై విశ్రవో
జాతుండైంద్రికివల్కెనిప్డు జనసీ ♦ జాతుండనై తంబొగిన్॥ 131

ఉ॥ నీవె మహాబలాఢ్యుఁడవు, ♦ నీవె కృపామృతవారిరాశివిన్
నీవె సునిశ్చలాత్ముఁడవు, ♦ నీవె మహాధృతిశాలి, వెన్నఁగా
నీవె ప్రతాపసింహుఁడవు, ♦ నీమహిమంగనుఁగొంటినేఁడు నా
కీవె వివేకసంపద, గ ♦ పీశ! యడంపవె మన్మదాంధతన్॥ 132

ఉ॥ తారధరంబునెత్తితి, స ♦ దాశివుచేతను ఖడ్గమందితిన్
వీరవరేణ్యులందివిజ ♦ వీరులగెల్చితి, నట్టినన్ను నీ
సారతరంపుగక్షముల ♦ చాటునమాటి చతుఃపయోధులం
బీరముమీర ముంచితివి; ♦ భీమపరాక్రమ! నీదుమ్రోలనా
శూరత, లావు, సెన్నవృథ ♦ సూ;మఱిసిగ్గుఘటించొరుల్ వినన్॥ 133

వ॥ మఱియు 134

క॥ మారుతవేగం, బల్లయ నూరుననుజరయము, నమ్మ ♦ నోవేగంబుం
గేరుభవజ్జవ,మెన్నగ నారూఢిలవంబుఁ బెనగ ♦ నవివచ్చునెఁకో॥ 135

క॥ సుర,గరు, డోరగ, నర, ఖే; చర, కిన్నర, సిద్ధ, సాధ్య, సంఘంబులలో
పరికింప,నీకుసరిపోటరివిక్రముఁడొక్కఁడుగల◆డాజగములలోన్॥ 136

క॥ ఇచ్చకముగాదుసుమ్ము,వి;యచ్చరరాణ్ణందనమణీ!◆యఖిలజగములం
దెచ్చటఁగన్నను,నీకెనవచ్చుఘనుండున్న జూ◆పవచ్చునొకనిన్॥137

క॥ నాకన్నవు; నక్కఁజుఁబలె; నీకనుగుందమ్ముగుజ్జు◆ నేను, నిరువురం
బేకము; పొందుజలువుదము; నీకల్మియనాదుకల్మి◆ నేనీ,లెంకన్॥138

క॥ పురుహూతతనయ! యిమ్మహినిరువురముం బాలునీరు◆ నెట్లట్లిపుడున్
దిరువురముకలసి;చూపరులిరుబొందులకాని,చిత్త◆మేకంబనఁగన్॥139

చం॥ అనిపలుకంగ; నల్లెయని ◆ నైంద్రి, పులస్త్యకులాబ్ధిచంద్రుఁడో
డ్కొనిపురమేగి; తమ్మునకుఁ ◆ గొబ్బునరావణువార్తదెల్పి, కూ
ర్మినిదశకంఠు; దమ్మునికి ◆ మిక్కిలిగాఁగని, భూరిభూషలం
గనకపటమ్ములిచ్చె, రుచి ◆ గల్గిన విందొనరించివేడ్కమై॥ 140

క॥ హరిపతికెనయనదగునాహరిపతికడనొక్కమాస◆మటువుచ్చియు,నా
సురపతినిజపురికరిగెనుసురపతిసుతుఁడనుపఁగా,న◆సురబలములతోన్ 141

సీ॥ కెరలివచ్చురిపుశి◆క్షింపనేర్చుటకాదు; కేల్మోడ్చురిపుని◆రక్షింపనేర్తు
నాత్మశత్రులగర్వ◆మార్పనేర్చుటగాదు; తెలివినట్టిరరహి◆దేర్పనేర్తు
శివదూషణులనుభం◆జింపనేర్చుటకాదు;శివభూషణులనురం◆జింపనేర్తు
దుష్టులవెతలలోఁ◆దూర్పనేర్చుటకాదు;శిష్టులహితులలోఁ◆జేర్పనేర్తు
పెద్దలనుశ్రద్ధతోఁగాంత్రు◆బెరిమనెంతు
భీరులనుగూర్మినలరింత్రు◆బేర్మిబెంతు
నాత్మబలములరహిగాంత్రు◆నరులనొంతు
పద్మసంభూతపౌత్రులు◆బ్రాఘిమింతు॥ 142

క॥ ఈకరణి, నగవిదార, వి; ఘాకరనందనులునసుర◆బంపి, సుగుణర
త్నాకరులుయశోవిజితసు;ధాకరులనిశూరులెన్నఁదనరిరివిభుతన్ 143

వ॥ ఇట్లు వాలి సుగ్రీవులు నీరక్షీరంబులభాతి గలసి సుఖంబుండునంత
మఱియు నొక్కనాఁడు 144

(నిశాముఖంబున వాలిపై దుందుభి దురమ్మునకేఁగుట.)

సీ॥ దుందుభినాముండు♦దుష్టరక్కసుఁడొండు; మాయావి తమ్ముండు♦
మయునుతుండు। శంకరోర్వీధర ♦ సంకాశ తేజుండు; మహితసహస్ర
సా♦మజబలుండు। నెమ్మిమీఱశివుండునిల్పినవరముండు; నంత్రబమ
త్తుండు♦నైయతండు। జోకమున్నిరుండు ♦ చోటికినెక్కుఁడు; నదిగి
నాత్తోరండు♦ననికనుండు।

నపుడుసాగరుండు ♦ నక్కటాసీతండు; క్రొవ్విచివ్వనొండు♦గోడిగండు
మీఱివచ్చెజుండు♦మేదినినిమనండు; నింకతడవు,నుండు♦బెట్టులెండు॥145

క॥ లోలోననిట్టులనుకొని; శ్రీలోలాక్షీగురుండు ♦ చెచ్చెరచెంతం
దై త్రిలోక్యవైరిదుందుభి; నాలోకనసేసిపల్కు♦నతఁడుప్పొంగన్॥146

క॥ ఏనెంతవాఁడనం, చని; కూనెదనీతోఁడనీమ♦హోగ్రార్భటిదో
ర్దోనెంతవానికళుకును; లోనెరయగ జేయదే వి♦లోకనసేయన్॥147

ఉ॥ కావ్రన నేనునీకు సరి♦కాను, బలాఢ్యుఁడవీవు, కొండరా
తావున కేగు వేగమ, య♦తండు భవానిగురుండు, నమ్మహా
దేవుననుంగుమామ యల♦ద్వీపవతీపరిసేవితుండు, నీ
లావునకామహామహుని♦లావున కీడుగదాతలంపగన్॥ 148

క॥ అనినచ్చబలికిపంపిన; బనివినిపలలాసికాంచెఁ♦బర్వతపతినిన్
మునిరాజపరివృతుని,గుణ;ఖని,మణిఖనియుతునిమేన♦కారమణిపతిన్॥149

క॥ కనితద్గండోపలముల, ఘనశృంగమ్ములవకావ♦కలుగాఁబగులం
గనుదాకితదాశ్రయులగు,మునులకతిక్షోభ వాఁడు♦మొగిగావించెన్॥150

మ॥ ఇటుగావింప, నుమాగురుండు దెలిమే♦నేపారఁగావచ్చి త
త్పటుగాత్రుంబొడగాంచి, దుందుభికృపా♦పాథోధి వే; నీవు, నన్
జటిరాడాశ్రయుశృంగభంగమొనరిం♦చంజెల్లునానావుడ
క్కుటిలుండాడటు లేనిజూపగదె, నా♦కుందీటుగా నెక్కనిన్॥ 151

వ॥ అనిన హైమవతీగురుండతనికిట్లనియె. 152

క॥ ఋక్షవిరజాగ్రసూనుఁడు ఋక్షవిభుసమానయశుఁడు♦పృథుకిష్కింధా
ధ్యక్షుఁడతిబలుఁడుజితప్రతి పక్షుఁడహీనుఁడగువాలి♦పాలికరుగుమీ॥153

చ॥ అఱిగినవాలి నెదయిన• యాహవకాంక్షనుఁదీర్చు, వైరులం
దఱిఁగినవాఁడు, నింద్రసుతుఁ• డాదగువాఁడన, బోయె నైంద్రి నా
బఱగినవాలిఁ జేర, జని• వానిపురోపవనమ్మునందు, గొం
తరగినదాక నార్చి, మహి తార్భటిఁ గూల్చెఁ గుబాళి గొమ్ములన్॥ 154

క॥ దుందుభిరక్కసుఁడలసుర; దుందుభివర్షాంబుదములఁ• ద్రోనన గాఁ, దా
గ్రందుగ రవమటు సేయఁగ, నైంద్రిస్వదారయగుతార• నదికిమరుననిన్ 155

తే॥ గీ॥ ఉండి స్వాంతఃపురమ్మునం• దోలితద్రవంబు చెవిబడ నాలించి వాలు
గంట్లు! త్రోడఁ జను మెంచి ర కాసి• త్రోడఁ బల్కు; మహితవర్షాబ్దరవ
ము సమమ్ముగాఁగ॥ 156

ఉ॥ క్రందుఁగఁ గన్నుఁగానక స• గర్వుఁడవై యిటులార్చెదేల, రో
దుందుభి! నిన్ను నే నెఱుగు• దుం; ధరణీస్థలిఁ గొన్ని నాళ్ళ సి
ప్పుందువయేని, యీయెడను• నుండక వేచను, మేడ కేని, మే
నందున "ప్రాణమున్న బలు• సాకును నేఱిఁటినంగ రావో కో!" 157

ఉ॥ నావుడు రక్కసుండు కపి• నాయక! కాంతల ప్రోలదంభముల్
సీవిటు బెట్టుగొట్టదగు• నే, మొనకాడ వెనీవిసీ! కడు
న్లావుగలాడవేని, నిశి• నాకిపుడే చను దెమ్ము చివ్వ, కీ
వావిధిగాదయేని, నళి• నాక్షులఁ గూడుము ప్రేగునంతకున్॥ 158

వ॥ అదియునుంగాక నింకొక్కటి వినుము. 159

ఉ॥ ఇమ్మున కేగు, మర్ధతతి• కిమ్మనభీష్టము, లాంద్రమంచి తెం
దమ్మున గౌఁగిలింపుము, ము• దమ్మున సందఱఁ జూచికొమ్ము, రా
జ్యమ్మున నీసమానుని ర• యమ్మున నిల్పుము, రమ్ము వెన్క యు
ద్ధమ్మునకీవు, నీదగు మ• దమ్మున డించెదఁ బోర, వెండియున్॥ 160

ఆ॥ పానమత్తు, జిత్త• మానసెత్తమ్మాడు; వాని, నిద్రమత్తు• వాని, మించు
బోండ్ల కేళిఁ గాల• ముం బుచ్చువానిని; గూడి దుర మొనర్ప• గూడ దెపుడు 161

క॥ మఱియు, న• నాత్తాయుధు, నుక్కఱి, వెన్నిచ్చినవిభీరు• నంగవిహీనున్
శరణన్నవానిఁ దాకిన బరగంగా, భ్రూణహత్య• ప్రాపించైంద్రీ! 162

ఉ॥ నావుడు మందహాసవద• నమ్మున నైంద్రి స్వదారఁ దార, ద

జీవనజాతనేత్రలు వసించెడు తావునకంపి, గండుమై
దైవతశత్రుగాంచి, సమదమ్మున బల్కెదవోరిరమ్ము నా
లావునునీవుగన్గొనఁగ లాడవయేని దురమ్ము సేయఁగన్॥ 163

క॥ అనిమున్ను జనకుఁడిచ్చిన; కనకంపువరాలపేరు గళమునని డి, పో
రునకువడిగవిసె; మాంసా,శనకులపుంబాడబాగ్ని సముదుందుభితోన్॥

మ॥ పటుఘీంకారము సేయు మత్తకరిపైఁ బాహాబలంబార ది
క్తటులల్లాడఁగ నుప్పళించెడు మృగేంద్రంబుం దరంబెంచితా
నిటులాదుందుభిపాకి, శృంగములనెం తేపట్టి వాపోవదోః
పటుతంద్రిప్పస్రవించె ముక్కునుదరీ భాగంబునన్ రక్తమున్॥ 165

వ॥ అంతట నప్పట్టువిప్పించుకొని, పొట్టక్రొవ్వునందుండ రక్కసుం, డిలాతలంబునకుఁ గూల్పించి దుముకుటయు, నింద్రుపట్టి, ఘట్టించి నెట్టి పట్టి, మోకాళుల, మోచేతుల, బాదంబులం ద్రోచి తాచిన, వెన్నిక వాహు మగుడ నెదురించి పోరుటయు 166

క॥ ఇతరేతరజయకాంక్షుల మతకరులనవారు ఘోరమాత్సర్యమునం
దితిజుబలమడగె,నిర్జర పతిసుతుబలమొసగె నుదయభాస్కరుపగిదిన్ 167

ఉ॥ హీనబలుండువాఁడగు, డహీనబలుండగు వాలికాంచి, దో
ద్ఘోణవిషాణయుగ్మమును ముల్చి, స్వముష్టిబలంపుఁదాకునం
దానవుబిల్కుమార్చిజత నమ్ముగ గాళులువట్టిత్రిప్పి బీ
రాన నొకామడావలన వ్రాలగవైచె; లసద్బలమ్మునన్॥ 168

(మతంగముని వాలికి శాపంబిచ్చుట)

సీ॥ వైచిన,నదిసమీపమ్మునగలబుశ్య మూకాద్రినిమతంగమునితపోవ
నమ్మున వ్రాలి వృక్షమ్ముల జంఝూనిలమ్ముగూర్చినలాగు వమ్ముసేసి
తద్రక్తమాభూమి దడుపఁగా,నమ్మౌని;కోపించియెవ్వాఁడొ కుమతియగుచు
నీలాగుసేసెనా పాలసుడిదిమొద; లీపర్వతమ్ముద్రొక్క వానిశీర్ష
మట్టిబడినూరుఖండంబులగుచుజచ్చు। నదియకాకుండ;నాతని యాప్తు
లెవ్వరచోటుజొచ్చిననారీతి నగుదురనియె। నదియెఱిగివాలియచ్చోటి
కరుగడయ్యె॥ 169

వ॥ అనినవిని వారలటమీఁద నెబ్భంగిఁ బ్రవర్తించి రెఱింగింపుమని దుర్గ,
భర్గు నెచ్చరించునట్టు, లప్పొట్టిచెవులతపసి జెట్టిం, జన్నిగట్టులొక్కపె
ట్టున నిటలపట్టిక గేలుదోయిమొట్టి మ్రొక్కియడుగుటయు 170

ఆశ్వాసాంతము.

వృత్తకందద్విపదగర్భితసీసము.

సుజనసంస్తుత్య! వి♦శుద్ధసత్వగుణ! వర్షాబ్దాభదానాఢ♦గా శ్రితార్త!
సుజనసన్మాన్య! య♦శోనిశారమణ! స్వజ్ఞానాభ్యభభోగాకరా!♦దయాబ్ధి!
భువనజాక్షిమణి♦ముత్యమారమణ! శుంభద్వైభవప్రాభవా!♦కృతిహిత!
భువనజాక్షిస్మర! భూసురాదరణ! శశ్వద్రాజమాంబోద్భవా!♦ఘనమతి!
కమ్మకులవార్ధిచంద్రమ! కమ్మనిగొన
వు, రతనాల♦కమ్మిగలాడ!♦పురుషవర్య!
నెమ్మిగలవాడ! సత్కవి♦సమ్మదకర!
స్తోత్రజనక♦ సత్కులజుండ!♦సోగ్భలాఢ్య! 171

శైలబంధము.

క॥ పరకీర్తనీయ! రమణీస్మర! న్యాయార్జితధనాఢ్య!♦మాన్యాఖ్యధరా!
వరకవిరచితకృతిప్రియ! ఖరకరనందనవితీర్ణ! ఘనసద్వర్ణా! 172

మాలిని॥ కవిపికసహకారా! కాంచనోర్వీధ్రధీరా!
సవినయగుణహారా! శౌర్యధైర్యప్రచారా!
ప్రవిమలమతిసారా! రాజమాంబాకుమారా!
కవిభరణవిచారా! కల్పవృక్షావతారా! 173





# శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకము.

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీమద్వైష్ణవభక్త స్తోమసుధాధామ! కావ్య•స్తోయజనేత్రీ
కామ! దయాగుణాజిత లక్ష్మీమహిళా•కామ! శ్రీప•కీరయనాయా! 1

క॥ అటమీఁది తెలుఁగువినుఁడు;త్కటకరుణాజింద్రధరుఁడు•కాళికిక్షితిభృ
త్కటకమునను సువ్రవమున; నటసూతుఁడు సెప్పెమునుల•కవలికతవినఁగా

(మాయావి కిష్కింధాపురీ ద్వారములోఁ జేరి గర్జిలుట)

ఉ॥ శ్రీవులుమీరఁ బావనిఁగడిందిమగంటిమిఁగూడివాలి సు
గ్రీవులు నెప్పటట్ల దమ•గీములనుండ; నొకప్డు నా, లస
ద్భావులుఁ రాత్రిమైమఱచి•పండిన వేళ, మయాత్మజుండు మా
యావి, లసద్బలుండు మహి•తార్భటి ద్వారమునాగిగర్జిలెఁగా॥ 3

శా॥ ఆగర్జారవమాలకించి ఘనరో•షావేశ మేపారగా
వేగంబానుపుఁడిగ్గి, వానిపయి•దోర్వీర్యంబునందూకబో
గాఁ, గంజాక్షియుఁ దమ్ముఁడీయెడలఁబోఁగాఁజెల్లదంచెన్నఁ, దా
నాగం డాతఁడు; శూరపుంగవునక•ట్లాడంగధర్మంబొకో॥ 4

ఉ॥ దుందుభిపూర్వజుండొడరి•దోర్బలమారగ దాకినట్టి సం
క్రందనసూతికూత్రగవి•కర్తనసూతియరింగెఁ గాంజరీ
నందనుబట్టణంబున జ•నంబులఁగావఁగఁబెట్టిసుందరీ
బృందముసద్దడంచి వినికృత్తవిరోధినరాధియుక్కడాఁగా॥ 5

(వాలి సుగ్రీవులు మాయావిం దాకుట)

ఉ॥ అట్టులువ్రాయిబెబ్బులుల• యట్టులుదాకిరివాని నాజగా
జెట్టులు, తాకగాభయముజెందకవాఁడును హుమ్మటంచుదాఁ
జెట్టులుబిట్టుపీకిదన•చేదిటవారఁగవారినేయ, బెం
గట్టులుబెల్లగించి భుజ•గర్వమునందగ వారునాకిరా॥

క॥ వారిరువురట నొక్కఁడె! ధారుణిఁగూల్పవలెనంచుఁ • దైత్యేంద్రుండున్ ।
వారిరువురతసిగూల్పఁగఁ! బోరిరిసమబలిమిజాల • ప్రోద్ధ్వజయేచ్ఛన్ 7

ఉ॥ అంతటవాఁడు కొంతవర • కాత్మబలంబడఁగంగ, వారిన
ల్లంతట బాఱదోలి మహి • తార్భటిబాఱఁగ, వాలియున్ రుమా
కాంతుఁడు దోనవెన్నడిరి, • కల్వలరాయనివెల్గుదోడ్వడన్
బంతమెలర్పవాఁడు నొక • పర్వతరాడ్గుహజొచ్చెఁ బల్వడిన్ 8

తే॥ వల్లరీచ్ఛన్నదుర్గమ్మువరబిలమ్ముజొచ్చియిటుకన్మొఱంగినసోకునడప
వలయునంచెంచి, వెన్నంటివచ్చుముద్దుదమ్ముకుజ్ఞకుశక్రనందనుఁడువలికె

చ॥ అనుజుఁడ! యీగుహాముఖము • నందువసింపుమునీవు, నేనునీ
దనుజునడంచివచ్చెదము • దమ్ముఁన, నేనిటబెద్దనుండ నీ
వనుపుగఁజేయఁగావలయు • నా! రణమంచనినాడ నాహవం
బున రణకోవిదుల్ బాగడ • బోరఁగలేవను శంకఁగాదుసూ! 10

మ॥ అనివాక్కుర్చిచ్చిన భ్రాతపల్కువినియ • య్యర్కాత్మజుండన్న! నీ
వనినట్లద్దిసరేసురద్విషులమా • యల్ పెక్కులౌక్కొండవీ
వనికింబోవఁగఁజెల్లదేనునట సాహాయ్యంబుగావత్తు నీ
కనిసౌహార్దము భ్రాతృభావమునునే • పారంగఁబల్కొందగన్ 11

(వాలి తమ్మునిగుహాముఖమున నిడి లోపలికేగుట)

క॥ అనిపలికిన నవ్వాలియు ననుగుందంఘ్రిపదయుగము • లానజుమీఁయం
చినజుఁగుహాముఖముననిల్పి,నడచె,రాకాసితేని• వెన్నంటివడిన్ 12

చ॥ ఇటునిబిడాంధకారచయ • మెల్లెడబర్వభయప్రదంబునై
పటుతరమౌగుహాంతరము • భంగురభంగిగమించి వానినో
కుటిలుఁడ! పోకుపోకుమని • ఘోరతరంబుగ నార్చుచుందదా
ర్భటిగుహమారుమ్రోతలిడవాసవ • సూనుఁడుగోసెరోసినన్ 13

వ॥ ఇట్లొక్కయేఁడుదాటినంత వానిగాంచితాకిన 14

తే॥ కరధృతప్రస్తరుండయి• కర్బురేంద్రుఁ;
డుక్కునను వాలిరొమ్మున • నొక్కపెట్టు
బెట్టవజ్రాభమౌవాని• పేరురము;
నడచి పదినూరుఖండమ్ము • లయ్యెనదియు 15

క॥ మెటరి రక్కసుబిడికిటిఁ బోటుననవ్వాలివొడువ • భ్రూమధ్యమునన్
బోటుననగురిసె రక్తము,మాటికినాసావివరపు • మార్గములవడిన్
వ॥ ఇట్లితరేతరజయకాంక్షులకయ్యెరువురుంబోరుచుండిరంతనిక్కడ 17
శా॥ భ్రాంతింజెంతమెగాలు గ్రో • లవడిరా; రక్తప్రవాహంబులం
తంతన్ఫేనముతోడవచ్చె విమతా • హంకారనాదంబుల
త్యంతబున్వినవచ్చె, మ్రోఁగగుహయుం; • దద్వాలిరావంబు ర
వ్యంబైన న్వినరాకపోయె, రవిజుం • డార్తిన్ వెసంబ్రుంగఁగాన్ 18
తే॥ అంతసుగ్రీవుఁడేడాది • యైనగాని
యన్నరాడాయెఁబ్రతిపక్షు • లార్భటిగుహ
మించె నిదియేమియక్కటా • యంచెడంద
జింతచేఁదలపోసె నా • క్కింతసేపు 19

[సుగ్రీవుఁడన్న నిహతుఁడయ్యెనని పురంబు జేరుట]

ఉ॥ ఇటుదలపోసి వాలినసు • రేంద్రుఁడడంచెనటంచునెంచి త
త్కుటిలుఁడు రాకయుండనొక • కొండను తద్గుహావాతద్రోసి, త
త్పటుజవుఁడార్తినన్నకుయ • థావిధివిడ్చితిలోదకాలు, న
ప్పటికనులైనలాగున స్వ • భ్రాతృసతీమణినూరడించెఁదాన్ 20
క॥ ఈకరణిఁదిగులుచేత,బ్రభాకరతనయుండునుండ • స్వసచివులెంతే
నీకరణిరాజులేక,ప్రభాకరతనయ!నిలువంగ • వచ్చునెయంచున్ 21
క॥ పూజ్యంబగుతద్వానర రాజ్యంబునకర్కజుండ • రాజనితత్సా
మ్రాజ్యంబునొసగిరర్మిలినోజ్యాధరతనయ!వార•లొప్పఁగనెంతే 22
ఉ॥ ఇక్కడ నర్కనందనుఁడు • నీవహీనుండఁగఁ; దానవేంద్రుతో
నక్కడనబ్బలారిసుతు • డవ్వహినస్త్ర సుశస్త్రపాళుల
య్యెక్కుడు ప్రస్తరోర్విజము • లెంతయుఁగైకొని సక్రమంబుగా
నొక్కఁడుపోరిపోరియవి • యొక్కడులేమిమహాగ్రహంబునన్ 23
శా॥ ముష్టాముష్టిని, నాములేనుగుల పో • ల్పుందీటి, పంచాస్యవి
స్పష్టాహంకృతిఁబోర, శక్రసుతుభా • స్వన్ముష్టిఘాతమ్ములన్
భ్రష్టంబైసకలాంగకంబు లలస • ద్రక్తంబులంగ్రక్కఁగాఁ
బిష్టంబుంబలెనయ్యె వానిమెయిదో • ర్వీర్యంబడంగన్వెసన్ 24

ఉ॥ ఆపయి రాక్షసేంద్రు బల • మంత యడంగు టెఱింగి పొంగి, తా
రాపతివాలి, దైత్యుని స్వ • రత్నసహాసను వక్షమందు బెం
గోపముతోఁ స్వముష్టి నటు • గ్రుమ్మఁగ, ముక్కులనోర వీనులం
బాపపు సోకునల్లనొగి • మాటికి గ్రక్కుచు వీడె బ్రాణముల్ 25

తే॥ కులిశహతి నేలఁ గూలిన • కొండవోలె;
మనువసుతు ముష్టిఘాతంబు • మయసుతు నెద
దాకి కూలినఁ గొండ బ్ర • ద్దలయి ఘూర్ణి
లెను మృగమ్ములు భీతిచే • తనుదొలంగ 26

ఉత్సాహము॥ అశరేంద్రుఁ డిట్లుడంగ • నతని చుట్టలెల్ల తా
రేశుఁ జుట్టుముట్ట, నగ్ని • నేచి చుట్టుమినుతల
ట్లాకెలదరు మ్రోత; వారి • నట్టె యొక్కరొక్కరిం
గీశభర్త దుంతరాతు • గీము జేర్చె నుక్కునన్ 27

ఉత్సాహము. రాక్షసేంద్రు వానిబంధు • రాజి యుద్ధమందు గీ
శక్షపాకరుండునిట్లు • జావ మొత్తి వేడ్కమై
నాక్షణంబునందతగ్గు • హాముఖమ్ముఁ జేర హ
ర్యక్షవిక్రముండు నర్కి • బ్రక్కనిల్వకుండియున్ 28

పంచచామరము. గుహాముఖంబునందు దొడ్డ • కొండ గ్రక్కనట్లు త
న్మహాబలుం డెఱింగి వాని, • మాటికర్క! యర్కజా!
సహాయమేగుదెంచి నీవు • చాలనిల్చి యిందుని
ర్వహిన్మెఱింగి తేలనయ్యె • పల్క కేను బిల్వఁగన్. 29

క॥ అనియరచియరచి గుహావా। తను గ్రుక్కిన కొండ గాళ్ళ • దాచికినుక ద
మ్మని దూరుచు, వాసవనం, దనుడరి గౌపురినగంబునకు శర్వాణీ ॥ 30

(వాలి మాయావి ఖండించి పురంబు జేరుట)

వ. ఇట్లు పురంబు జేరి పట్టాభిషిక్తుండు, సింహాసనాసీనుండు, మంత్రిపురో
హితాచార్య బంధుజన పరివృతుండునగు నర్కనందను జరచురం జూచి
ప్రళయసమయసముజ్జృంభితీ దావపావకుండునుంబోలె, మండిపడుచు, క
ట తటములదరఁగ నీనికలనిప్పుకలుప్పతిల్లఁ గ్రోధాంధకార మగ్నమాన
సుండై, పలుగురాలం ద్రిరగలింబోసి త్రిప్పిన చొప్పున బండ్లుగొఱుకుచు నభా

జనంబుల నెట్టికొనిపోయి సమీపించి యిట్లనియె. 31

శా॥ ఓరీవృక్షచరాధమా! కపులు లేరో! వెంటరారో! మదా
జ్ఞారీతింజరియింపరో! మదమునంజండాల! నీపోల్కి వా
శేరీ యిట్లొనరించిరే; యహహా నీ వన్నెమందురా! తమ్ముడం
చేరీతింనినుబల్కరింపదగు నీవన్నీ యెంతకేజాలుగా॥ 32

భుజంగప్రయాతము-కులద్రోహి! నన్నింతకుం దండ్రిముంచెం
ఖిలాత్ముండవంచెంచ కన్యావ్యరాజ్యం
పులక్ష్మిన్ భవద్బాహువుం జేర్చి; దుర్గం
బులంగ్రోల్ హరిక్ష్వేడముం గ్రక్కుకున్నే 33

క॥ ఉన్నాడవుమత్పురమున। మున్నాడవునేను బెంపమమువ లెసుకముల్
గన్నాడవునాద్రవ్యము దిన్నాడవునిట్టిడవ్రుటు దెలియగనైతిన్॥ 34

చ॥ హరిహరి నిన్నుతమ్ముడవటంచుగుహాముఖమందునిల్పినే।
నరిగిననమ్మి యేతపని యైన నొనర్చితిహాంతకారి! నే।
సరగునవత్తునంచునొక శైలముతద్గుహవాతనూకితే।
పరమకిరాత! చూడుముభవన్మదమార్పకయున్నవాలినే॥ 35

వ. అని మహాగ్రహంబునం బౌరందరి వలుకుచున్న నంతకుమున్న
నర్కజుండును 36

సీ॥ భక్తిమైయెదురుగాబర తెంచిసాష్టాంగదండప్రణామంబు దగనొనర్చి
మాపుణ్యవశమున నాపుణ్యజనునిమాయావిద్రుంగించి తేయార్చి పేర్చి
దిక్కుమాలినకీశ దేశంబునకుమాకు; దిక్కుఖువచ్చితే దితిజునోర్చి
తెలిపట్టుగొడుగుభక్తినిబట్టెదనుగొమ్మ;కడకమ్మెనీదుప్రక్కందలిర్చి
తే॥ మంత్రులేగొల్వసిల్వముమహిమజేర్చి।
అబలలంగేళిదేలుశయ్యకునుదార్చి।
మఱియునీతినిబల్కుము మమ్ముగూర్చి।
ద్రుంచివచ్చితిగాదె శత్రువునెదిర్చి॥ 37

సీ॥ మాయన్నయీవన్నమాటచొప్పననొక్క;
వత్సరంబుండితి బర్వతగుహ।
ముందునట్లుండగా బాలసుదిండులకేక;

య్యనఘుజతురబ్ధివలయితఘనభూమండలము ప్రిప్పె కనికరమరగాన్ ॥

ఉ॥ త్రిప్పినగ్రాంజరీసుతుడ తిప్రమదమ్మున నిట్టు పల్కె, నే।
జెప్పెద, లెస్సకుత్తుకవ జీరుడ! విన్మలఋశ్యమూకమున్ ।
దిప్పకువారి ప్రౌఢుతను "దిట్టుటచేత,, "మతంగమౌని" నే ।
జెప్పెడిదేమి, దేవరయు జిత్తమునందలపోయగాదగున్. 45

(సుగ్రీవుండు ఋశ్యమూకముఁ జేరుట).

క॥ అనిపల్కి తిరిగిగిట్టున । వెనుకకుజనిఋశ్యమూక పృథివీధ్రంబుం ।
గనిమంత్రిజనముతోనట। బనుపడసుగ్రీవుమండె భయరహితుండై ॥

వ. అనినవిని వినయపూర్వకంబుగఁ గుండలికుండలునకు గొండరాచూలి
యిట్లనియె 47

క॥ నాధాహనుమంతుండతి। మేధానిధి, విక్రమమున మృగరాణ్ణిభుడున్
వేధాభుడాగమాళ్య। క్రోధాత్ముండేకపాద రుద్రుండంచున్ । 48

శా॥ మీరేపల్కితిరొక్కనాఁడు నిటులీ మిత్రాత్మజుఁ వాలిబల్ ।
గాజింపందనలావుజూపక, నమో ఘుషాంతిమైనుండెదుం ।
భూరిబ్రాహ్మణశాపమేచఁ దసలా వుందా నెరుంగండొవా।
డీరీతింజనుభంగినుండగతమో యీశామెరింగింపవే ॥ 49

ఉ॥ నావుడు శంభుడిట్లనువి నాయకమాతకుదేవి! తల్లస ।
ద్భావుఁడు, నైంద్రినక్కనతి భక్తిసమానముగాగఁ గొల్చెమున్ ।
గాప్రునని ర్వ్యారందు నెఱి గల్గినవాఁడవుటం గపీంద్రుపై ।
లావునుగల్గియుందనబలంబునుజూపకయుండెనెంతయేన్. 50

క॥ ఈలీలదమ్ము డుండగ। వాలిమతంగమునిశాపభయముననటువో ।
జాలకలావటినిలిచె, బ। లాళియుబోకుండె; నిట్టులరిగెదినంబుల్ ॥51

వ. ఏతత్సమయంబున. 52

(పూర్వరామాయణ కథాసంగ్రహము.)

మ॥ సరయూతీరధరిత్రిభర్మవిధుపాషాణాభినిర్మాణ బం।
ధురసౌధాంతరఖేలనాపర, వధూ స్తోమామలాకార సుం ।
దర సంవీక్షితలబ్ధహ్రీంసహితకాంతారత్నసంతానభా ।
స్సురగీర్వాణ నికేతనంబగుచుఁదా శోభిల్ల సాకేతమున్ । 53

క॥ అవ్విధేశరేణు,సొబగుల। పువ్విలుతుఁడుసమదశత్రుఁ• భుజబలహరణుం।
డవ్వనజాప్తకులీనుఁడు। నెవ్వడిగలదశరథుండు• నెగడువిభూతిన్ ॥54
ఆ॥ సంతతమ్ముబాధసంతానమునకుసం; తానభూజమట్లుతాదలిర్చి।
ఇలను బెద్దకాలమేలిసంతానేచ్ఛ; శిష్టులాన• నిష్టిసేయునపుడు ॥ 55
ఉ॥ వేలుపుఱేఁడులోనయిన• వేలుపులెల్లరు,లంకనేలు తో ।
ల్వేలుపుఱేఁడు, లోకములవేల్పుల బెట్టినబాధఁ దెల్పి తో ॥
ల్వేలుపుఱేఁడ ! మమ్మిపుడుబ్రీతినిమన్పుమటన్న బుల్గుడాల్ ।
వేలుపుఱేఁడటంబనిచి- వేల్పులవానినడంచు నిచ్ఛతోన్ । 56
వ. నేతదిష్టివగ్నిపురుషుండొసంగిన పాయసంబున లీనంబయిదాని దశర
థుండంగనలకిడవారుగర్భంబులదాల్చి సుపుత్రులంగనిరి. వేలుపులవాన
రబలంబులుగా బుట్టనంతకుమున్న నేమించినాడుగావున. 57
సీ॥ సరయూతటమ్మునజరియింపగానెంచి•విరజాతటమ్ముపై వేడ్కమాని
సాకేతపురమునజోకనిల్వదలంచి•వైకుంఠపురముపై బాళిమాని ।
తోడబుట్టినటింపజూడగామదినెంచి•శయ్యాయుధములదాల్పంగమాని
భూమికన్యకాకేళిఁజాలదేలదలంచి•జలధికన్యకతోడిచెలువుమాని ॥
గీ॥ వనచరులగావనెంచిదేవతలవీడి।మర్త్యతనుడింపనెంచియమర్త్యతవిడి
అరిదరేషాసనందకా•ద్యాయుధాభి।రాముడయ్యెడదశరథరాముడయ్యె
చ॥ హిమగిరిరాజకన్యపతియించెనుమాత్రము• భారతీసతీ।
రమణునిగన్నవేల్పు వల•రాపగవానెదతమ్మితేటి, వే।
దమయుఁడు, గల్మితొయ్యలిము•దమ్మున నోచిననోముపంటదై।
త్యమదవిభేది కోసలసుతాప్రియపుత్రకుడైప్రవర్ధిలెన్ ॥ 5
వ. ఇవ్విధమ్మున శ్రీమన్నారాయణ పరబ్రహ్మాంశంబున గౌసల్యాగర
శుక్తిముక్తారత్నంబునాబుట్టి రాముండు తచ్ఛయ్యాయుధాంశంబులనై
కేయీసుమిత్రలకు జన్మించిన భరత లక్ష్మణ శత్రుఘ్నులంగూడి, తల్ల
లకుం దండ్రికిం గరమ్ముముద్దుగొల్పుచు బాలకళానిధివడువునం బెరుగ
చున్నంత. 6
క॥ కౌశికీసహోదరుం,డల। కౌశికసంపూజితాంఘ్రి•కమలుండంహః।
కౌశికదివాకరుండగు। కౌశికమునివచ్చెనొక్క•కాలంబందున్ ॥ 6

క॥ జనకుండంతటరాముని జనకునిరావించిస్తోత్ర♦జనకంబుగ శ్రీ
జనకుండుశంబరాంతక జనకునకయ్యిందిరావి♦శాలాక్షినలెన్॥ 68

క॥ కమలాయతాక్షిసీతాం బమహావైభవముతో "ఇ♦మాంకన్యాంతు
భ్యమహాంసంప్రదదే"యని క్రమతందాధారవోసె♦రామునకెలమిన్

ఉ॥ ముద్దుకొమార్తెకర్మిలిని♦ ముత్తెపుబొత్తుల, జీనిచేలలం
బుద్దులవెన్నొ చెప్పియిడి♦ భూపకుమారుఁడురాముతోడబల్
ముద్దులమూటగట్టునొక♦ పుత్త్రికి తేరున నెక్కఁజేసియా
ప్రొద్దుకొలంపుఁజందురుని♦ బుచ్చెనుతన్మిథిలేశుఁడంతయేన్॥ 70

వ॥ ఇట్లుసబహుమానంబుగాజనకుడంపంజనిరంత. 71

క॥ శ్రీకరుఁడగురఘురాముఁడు జోకరహింజనుచునడుమ♦శ్రుతిపారగురా
ఢ్భీకరునిఁజామదగ్నిగు ణాకరుగర్వంబడంచి♦యరిగెంబురికిన్॥ 72

చం॥ పురమునకేగిపఙ్క్తిరథ ♦ భూరమణాజ్ఞఁదలంధరించిసా
దరమునముద్దుతమ్ముఁడును ♦ ధారుణినందనకూడరాగస
త్వరమునరామచంద్రవసు ♦ ధారమణుంఁడువనమ్ముఁజేరెనా
పురమునవెల్లవారుగడు ♦ వొక్కుచువృద్ధమహీశుదూరగాన్ 73

వ॥ ఇట్లుజాయానుజోపేతుండై చనిచని 74

క॥ ముంగలగాంచెనురాముఁడ భంగతరంగానుషంగ ♦ వాక్తురగంబున్
రంగదపాంగంబాకజ సంగతభృంగన్మహేశ♦సంగంగంగన్॥ 75

వ॥ కనిగుహుండనుకిరాతపతి సహాయంబున సేతన్నదీలలా
మంబునుత్తరించి, చిత్రకూటంబుదాటి, దండకా
రణ్యముంబ్రవేశించి జాయానుజోపేతంబుగ నున్నంత॥ 76

క॥ నెరవాడిగోళ్లరక్కసి ఖరనాసాశ్రవణ యుగ్మ♦ కముగోసివెసన్
ఖరదూషణాద్యసురసంహరణంబొనరించిరామ♦మహీపతినిలువన్ 77

తే॥ చాలుపేరింటిపూబోఁడి ♦ చక్కదనము
శూర్పనఖవర్ణనముసేయఁ ♦ జొక్కిరాక్ష
సేంద్రుఁడుసుబాహునన్నస్వ♦ర్ణముగనె
నర్చిపంపించెసీత సం♦తసపషంగ॥ 78

పంచచామరము. మృడానిభర్తకేలదాల్చు • నేణపోతమెన్న న
క్కడానిలేడిఁదెమ్మటంచుఁ • గాంతవల్క నెందునే
గ్గడానిలేడిఁజూడమంచ • నంగదోడువిన్కన
ప్పడానిలింపులెన్న లేడి • బొంతనేగెరాముఁడుౘ॥ 79

క॥ సారంగమునేలియునీ సారంగమునేయుకెట్టు • చాలనిశిత్రుకై
సారంగముగుండఁగఁద త్సారంగముగూల్చె రామ • చంద్రుఁడుగడిమిౘ॥

చ॥ మృగమునుద్రుంచివన్యమృగ • బృందముదగ్గనిపాఱ రాముఁడా
జగములతల్లినిన్విడచి • చయ్యనవచ్చుసుమిత్రసూతిఁజె
ట్లగములగాంచికుందుచుని • లాతనయామణినోలిబాళి ద
న్నగములఁజెట్లనారసి మ • నమ్మునఁజింతిలుచిర్వురున్వెసౘ॥ 81

క॥ రోయుచుసీతమవార్తజ టాయువెఱింగింపగానె • డందనలరుచుం
డాఁకుకబంధునికరముల ప్రేయుచునసిధారశబరి • విందొగిగొంచుౘ

క॥ రంపులురొంపులు లేకని లింపులనది పెంపునంజ • లింపుచుఁదమ్మల్
కంపులతుంపరలందగ పెంపులడంపునలపంపఁ • బ్రేముడిఁగసరా॥ 83

క॥ కనితద్వీమల్లోదకములఁ గొనితడవకుదాని పెంపు • గొనియాడుచు,ద
ద్వనితరుచయంపునీడలజనితపథశ్రమలడపుచు • జరియించునెడౘ 84

(సుగ్రీవుఁడు రామలక్ష్మణులంగాంచి భీతిల్లుట)

సీ॥ శ్రీకరరుచిమనోజ్ఞాకారములవారి గర్ణాంతదీర్ఘాంబ • కములవారిఁ
జటులపోలికజుట్టు • జడలచుట్టలవారిఁగమనీయమైనవి • క్రమమువారి
వీఁకమైమోఁకాలుఁదాఁకు • చేతులవారిఁ బలువింట్లమూపుల • బరగువారిఁ
బొలుపారురాచకే • వులఁజెలంగెడువారిఁగావిధట్టులబిట్టు • గ్రాలువారిఁ
గంబుసుందరమంగళ • గళమువారి
డంబుమైగుల్కువిప్పాటు • రంబువారి
నద్యగణనీయశుభలక్ష • ణములవారి
రామలక్ష్మణులంగాంచె • రవిజుఁడపుడు 85

మ॥ కనిభీతుండయినల్లగుండెనలుప్రవ • క్కల్ గాగనిప్రవ్వద్రా
క్కనఛందంబునఁదత్తరానమొకచ • క్కంబాదమొక్కంతసే

ఫునుపంజాలకదేపకయ్యానఘులం ♦ బ్రోద్యద్ఘనాకారులం
గనుచున్మోమునవిన్నవాటోదవజో ♦ కట్లోనదర్కించుదాఁ 86
మ॥ మునివేషంబులదాల్చినారు, విలున ♦ మ్ముల్ బూనినా, రుగ్రభం
గినిగాన్పించుచునున్నవారు, ననుర ♦ క్త్రిండిర్వ్యచున్నారు,న
వ్వనిగెల్వంబురుహాతసూతిమునిరా ♦ డాకారముల్ త్రోడ,బం
పనితే తెంచిరివీరు కాకశరచా ♦ పంబుల్ మునుల్ దాల్తురో! 87
మ॥ మొకముల్ జేవ్రురిలంగనికపులుసం ♦ క్షోభంబునన్నారెవ్వ
తుకదంబాబులఁదూర్ణచంక్రమణముల్ ♦ సాగింపుచున్నారుసా
కొకలాగున్నదినెమ్మనంబునిఁకనే ♦ నుండంగరాదిందటం
చోకఁడేమోచననేగ,బావనియున ♦ చ్చోఁజొచ్చియందిట్లనుఁ 88
ఉ॥ ఏటికివానరేంద్ర! మొగ ♦ మేదియెకాంతివోఁఅంగియున్న,దీ
వేటికిభీతవృత్తినటి ♦ యించెదువానికిబోలెఁదోఁచె,దిం
దేటికిభీతిశక్రసుతుఁ ♦ డేనితదాశ్రితులేనిరారు,ని
చ్చోటికివేరొకంఱమను ♦ జుండరుదెంచిమనంగనేర్చునే 89
ఆ॥ అన్నవిన్నఁదనమునాన ♦ నమ్మనదోప
నర్కవల్కనిట్టు ♦ లాంజనేయు
త్రోడ,గనుమువత్స! ♦ దోర్బలశాలురు
నిరువురుసరసిదరి ♦ దిరువుదురదె 90
ఉ॥ అందనవద్యులన్యరశ ♦ రాసనహస్తులవారిఁగన్ననా
కందినగాయమెంతయువ ♦ కావకలైచనెనేమిచెప్ప సం
క్రందననందనుండనుప ♦ గా మునివేషములూనివచ్చినా
రిందనకద్దికాదనిన ♦ నేటికివారికివిండ్లునమ్ములుఁ 91
ఉ॥ ఐనభిక్షురూపమున నమ్మహనీయులచెంతకేగి.నీ
వైనవచశ్చనుత్కృతిని ♦ నామహిమాధ్యులరాకకుంగతం
బైననెఱింగిరమ్మనన ♦ మావలకార్యముజూచికొందమ
ల్లైనమనంబులోనిదుడు ♦ కాగుననాకుఁగపీంద్ర! వెండియుఁ 92
ఉ॥ అక్కడివాలివంపనిట ♦ కామహనీయులురారయన్ని,వా

రెక్కడినుండివచ్చిరో,మ ♦ ఱెక్కడికేగఁదలంచిరో కో,ని
ట్లిక్కడిభూములారయఁగ ♦ నేలొకొనీవిధిమెల్లదెల్సియే
ఇక్కడికట్టిరావలెన ♦ హీనజవమ్మునవంచుఁ బంపెఁదాన్ 93

వ. ఇట్లు పుచ్చినంజవంబున నేగి

(హనుమంతుఁడు భిక్షురూపమున రామలక్ష్మణులం జేరఁబోవుట)

క॥ ఘనకపిరూపమునూడిచి, వినయముమీరంగభిక్షు ♦ వేషంబునన
య్యనఘులపాలికరిగిభ, క్తినమస్కారంబుజల్పి ♦ కేల్మోడ్చివెసన్

తే॥ మంజుసామ్యామలోక్తుల♦నాంజనేయుఁ
డిచ్చమచ్చికనచ్చుగ♦ ముచ్చటించి
యామహాత్ములకిట్లను ♦ నాత్మమతము,
నర్కసూనునిమతమును♦నచ్చువడఁగ 95

సీ॥ శ్రీకరులార!సం♦భృతశరాసనులార! మీరెవ్వరిట కేమి♦ కారణమున
చనుదెంచినారురా♦జర్షిదైవతతుల్యులరు,మునిరాడ్వేషు♦లరువ్రతులరు
క్రోధహీనులరుధీ♦రులరుపావ్రణ్ణీలమేఘభర్మాభమా♦మేనులరు, శు
భాకరులరు,జగ♦దారాధ్యులరు,మనోజ్ఞాకారులరుసద్గు♦ణాకరులరు
సరసపంపామహత్సర ♦ స్తటముహెూర్వి
నురుతరాతురత వెదకు ♦ చున్నవారు
తమ్ముఁగనుగొనిపక్షిసం ♦ తతులువాఱ
దేహకాంతివృక్షమ్ములు ♦ దీప్తిమీర 96

ఆ॥ దివినిఁదిరిగితిరిగి ♦ దివివీడిక్షితిభీతి,సంచరణముగడక♦ జల్పవలయు
నంచువచ్చినట్టి ♦ హరిణాంకమార్తాండు,లంచునెంచువాఁడ♦నాత్మలోన

ఉ॥ భూరిసువర్ణరత్నమయ ♦ భూషణబంధురతారహారఁవి
స్తారసువర్ణవస్త్రఁహరి ♦ చందనధారణయోగ్యభవ్యశా
రీరమునారచీరలధ ♦ రింపఁగనక్కటమీరలీసర
స్త్రీరపుఁజెట్లఁబెంబొదలఁ ♦ దిర్వెదరేలొకొ నాకుఁబల్కరే? 98

క॥ పరమేశశరశరాసన,శరధులకెనయైనతీక్ష్ణ ♦ శరధనురిషుధుల్
శరములమూపులఁదాలిచి,వరమునివేషములదిరుగు♦వారెవ్వారో

సీ॥ ఏ వెన్ని వితముల♦ నెచ్చరించిననీరాఁబల్కు రాత్మచరిత్రఁ♦బల్కు వాఁడ
వినుఁడయ్య!సుగ్రీవుఁ♦డనువనచరపతిభ్రాతృవంచన చేతఁ♦బడలి, నాఁడ
కడకసెఋశ్యమూ♦కమునకుమంత్రిసంయుక్తుఁడై వచ్చెనె♦ మోస్మాసుగ్రీవు
గూడనిల్చిభవద♦కుంఠితస్నేహమ్ముఁ జేయనన్నిటకన్పఁ♦ జేసి నాఁడ
నతనికర్మిలిబెగ్గడ ♦। నైనవాఁడ
వాయుపుత్రుండనంగనే ♦ వరలినాఁడ
కామరూపసంచారతఁ ♦ గ్రాలినాఁడ
బరగహనుమంతుఁడనుపేర ♦ బరగినాఁడ 100

తే॥ సూరపుత్రునిహితము నే♦గోరిభిక్షు వేషమునవచ్చినాఁడనో♦వీరవర్యు
లారయనిహనుమంతుండు♦నూరకున్న రాముఁడాత్మనలరిసుమి♦త్రజునిక
(నియె)101

క॥ వారిజభాంధవ♦తనయుని,కూరిమిఁ బెగ్గడయవీడ♦గుం,దమ్ముఁడ!యి
ష్టేరికయిమనము♦నివ్వసిఁ జేరితిమోవా రెమనలఁ♦ జేరెదికంటే 102

సీ॥ ఒప్పుగా మెప్పుగా♦నిప్పుడీకపిచంద్రు♦నకునీవుప్రతివచ ♦ నమ్మునిమ్ము
చతురాగమమ్ములు♦చతురతఁబఠియింప లేనివాఁడిటువల్క♦ లేడునమ్ము
సర్వశాస్త్రమ్ములు♦సర్వమంత్రంబులు,సీతండెఱింగిన♦ దేనిజమ్ము
ముఁల్లోకములఁగల్గు♦నెల్లవ్యాకరణముల్ తమ్ముఁడా!యీతని♦సామ్మునసు
(మ్ము)
సంస్కృతమునవీని ♦ సాటిముల్లోకమ్ము
లందొకండులేడు ♦ లక్షణమ్ము
నందుఁగూడమిన్న ♦ యన్ననీవేలాగు
నిత్తువితని కెన్న ♦ నుత్తరమ్ము 103

క॥ కౌతుకవిలంబితమంబూ,కృతము,నబద్ధమ్ముతోస్సు♦ లెటలేక,విచా
రతనిడనిమధ్యమస్వర యుతసంస్కృతవాగమృతము♦లొగిఁ జెవినిడఁడే

తే॥తమ్ముఁడా!వీనివాగమృ♦తమ్ము జెవినిగ్రమ్మనేపాటిఘనపాప♦కర్ముఁడేని
తన్ను జంపంగఁగత్తి నె♦త్తంగనిమ్ము;కృపనుగావండెఘనతర♦ ధృతిఁదనర్చి

క॥ ఈదృశసచివవరేణ్యుని;సాదరమునఁ జేరబట్టి ♦ నట్టినృపతిపై

వాదమున కెట్టిమాఱ్తురు రాదిపురరువచ్చిరేని ♦ రాలకచనరా
వ మఱియు నిట్లనేక విధమ్ముల హనుమంతు రాముండు బ్రశంసించి
పలికిన. 107

(ఆత్మచరిత్రలక్ష్మణుఁడాంజనేయుతో ముచ్చటించుట)

శా॥ ప్రాజ్ఞుం డైనసుమిత్రసూతివలుకుం;♦బ్రాజ్ఞుంబ్రశంసార్హుకా
వ్యజ్ఞుం,బాడితవర్యుఁగాంజరిసుతుం ♦ గన్నారవీక్షించి, స
ర్వజ్ఞా!త్వత్ప్రభుశౌర్యధైర్యములను ♦ ప్పన్వించుమేమాకబం
ధాజ్ఞారీతినివచ్చినారముజుమీ ♦ హర్షంబుదైవారగా 108

క॥మఱియుభవత్ప్రభువాక్యము తెఱఁగునజెప్పెదమటన్న తెమ్మెరముద్దుం
జోఱయు నెదనలరియాలె, స్నఱితిగలానిజయమెడద♦నలరఁదలఁచుచుర్క

క॥ జగములనే లంగాఁదగు, జగజెట్టులెప్రొద్దుపట్టి ♦ సఖ్యంబెదన
చ్చుగఁగోరివచ్చి నారట;జగముకనుకొమారు చేత ♦ సాగకయున్నె

వ. అనితలంచి కేసరికిశోరంబు, సుమిత్రాత్మజుంగాంచి, దేవా! భవద
గ్రజుండు, మీఱు, నీపంపాతటంబున నేలగ్రుమ్మరవలసి వచ్చెనని పలికి
న హనుమంతునకు లక్ష్మణుం డిట్లనియె. 111

సీ॥ ధృతిమంతుఁడర్యమ♦ద్యుతిమంతుఁడ
క్షీణధారణావంతుండు ♦ దశరథుండు
ధర్మవంతుండరి ♦ ధర్మహంతుండు
స్వధర్మపారీణుండు ♦ దశరథుండు
శౌర్యవంతుండు,బల ♦ వీర్యవంతుండు,
సౌందర్యవంతుండుశ్రీ ♦ దశరథుండు
భాగ్యవంతుండు,సా ♦ భాగ్యవంతుం,
డసదృశబలాఢ్యుండుశ్రీ ♦ దశరథుండు
నట్టిదశరథునకునీతఁ ♦ డగ్రసుతుఁడు
రామనాముండువినుతప ♦ రాక్రముండు
భూతసంతాపహారుండు ♦ భూతహితుఁడు
జనకవాక్యపరుఁడు ♦ జననుతుఁడతండు 112

క॥ ఈలక్ష్మణనంతుసతిమ హాలక్ష్మీతుల్యసీత • మాంబయసుమిమ్మా
నే,లక్ష్మణాఖ్యుఁడన్ సుయశోలక్ష్మీవంత!సర్వ • శుభగుణవంతా

వ, అనిమఱియు నిట్లనియె. 114

ఉ॥ కాశ్యపిఁగోలుపోయి యల • కాశ్యపినందన,నేను,గూడ రాఁ
గాశ్యపినాథుఁడీవిపిన • కాశ్యపికింజనుదెంచి,యిందు ద
త్కాశ్యపిజాత,నేఁగొలువఁ • గారహినుండిన నొక్కనాఁడు, ద
త్కాశ్యపిజన్ హరించెనొక • దైత్యుఁడు,నన్నయు నేను లేనిచోన్

ఉ॥ ఉర్వరనందనన్వెదకు • చుండనొకానొకచోటమాకుఁగం
ధర్వుఁడొకండుశాపమున • దానవరూపముదాల్చిపిల్చి,తె
ల్పుర్వరకన్యజాడనల • యుగ్రకరాత్మజుడంచుబల్కన్వాః
పూర్వరమేగవచ్చితిమి • ప్రోద్దుకొమారుఁడ, మాకుదిక్కుగన్

ఉ॥ లోకశరణ్యుడుం,ద్రిదశ • లోకశరణ్యుఁడు,సద్యశుండు,ద
ల్లోకదృగన్వవాయనృప • లోకములందఱలోన మేటి, ము
ల్లోకము లేలువాఁడు,శ్రిత • లోకవిచారుఁడు, రాఘవుండు,సీ
తాకమలాయతాక్షికయి • ధామనిధిప్రియసూతిఁ జేరెదాన్ 117

క॥ ఎవర్ణనీయువీక్షణ, మావంతజగమ్ములందు • నలమఁగజగముల్
దావర్ధిల్లునొయతఁడి, చొచ్చివచ్చిరవిజునిశరణు • జొచ్చెనుజుమ్మీ

క॥ శ్రీరమణీమణిముఖసరసీరుహమధుపానమునను • జెందకఁదృప్తిన్
ధీరమునిహృత్కమలమధువారంగొనుకప్పు దేటి • యర్కజు జేరెన్

చ॥ అనవినివాయునందనుఁడు • హంసకులాభరణమ్ముగాంచిసం
తననను లక్ష్మణా!దివిజ • నాయకసూతికిబుద్ధి,నంగనా
జనములసంపదల్ గొనిచె • సందరుమంగభవత్సమీపముం
గొనకొనిచేరెనర్కజుఁడు • కుంఠితప్రేమలగాంచిరే రహిన్ 120

(హనుమంతుఁడు రామలక్ష్మణుల నర్కజునొద్దఁ జేర్చుట)

క॥ అనిరామచంద్రునకుమ్రొక్కిసిల్పి శ్రీరామచంద్ర • కీశపతిని చే
ర్మినిఁగనజనుదెండీయన, వినిలక్ష్మణుఁడనియెరామ•విభునకుభక్తిన్

శా॥ అన్నా!విన్నపమాలకింపు,మితఁడ • త్యాసక్తి భాషింపుచో

న్నం దానవమందు, నెమ్మది బ్రబస ♦ న్నత్వం బెకాన్పించు, నెం
దెన్న నోర్మ సముద్రోపదింత, యటులా ♦ శేగంగనా, వినిఃశో
నన్న న్వలైయటంచు రాఘవుఁడు నె ♦ య్యంబారఁగాఁ బల్కెన్

క॥ ఆపయిఁ బావనిభిక్షుక, రూపము నూడ్చి కపిరాజ ♦ రూపము నెంతే
జూపట్ట నెరసి వారిని, మూపులపైఁ దాల్చి రవిజు ♦ ముంగలఁ బెట్టెన్

ఉ॥ పెట్టి కరమ్ము బట్టి యను ♦ బ్రేముడి, నోరవిపట్టి! యీజగా
జెట్టియు బంతి తేర్గుగల ♦ జెట్టికి దొల్తటి పట్టి, రాము, డి
ప్పట్టున డాయ వచ్చె నిను ♦ భ్రాత సుమిత్రజుతోడ, నీవు నుం
బిట్టుగఁ బూజసల్పు రఘు ♦ వీరున కీయనఘుండు గండుమై 124

చ॥ జనకుని యానసజ్జనక ♦ జాతయుఁ దమ్ముఁడు గూడ రాగ, ని
ష్వనమును జేరి రావణుఁడు ♦ వారిజలోచన సీత ముచ్చిలిం
చిన వన మెల్ల నారయుచుఁ ♦ జేరిరి నిన్ శరణమ్ము, నీతఁడ
వ్వనజహితాన్వయాబ్ధిహిమ ♦ భానుడు జుమ్ము దినేశనందనా!

క॥ రాముఁడు, నిర్జితభార్గవ, రాముఁడు, మండితగుణాభి ♦ రాముఁడు సీతా
రాముఁడు, దారుణపాపవి, రాముఁడు దైతేయమదవి ♦ రాముఁడు సుమ్మా

వ. అనిన వినిరవిసుతుండు, హనుమత్సందేశంబున రామలక్ష్మణులవల
ని భయంబు, దిగనాడి, హనుమద్రచితతాళపత్రచిత్రాసనంబున, వా
రినిర్వుర సభక్తి పూర్వకంబుగఁ గూర్చుండబెట్టి, పూజించి మ్రొ
క్కి ప్రక్కనిల్చి యిట్లనియె. 127

క॥ ధీరులరని తతలోకా, ధారులరని విబుధగేయ ♦ ధర్మగుణమహో
దారులరని దైత్యమదవి, దారులరని పలికె హనుమ ♦ తగియుండెనటుల్

క॥ ఎక్కడి దశరథరాముం, డెక్కడి రవిజుండు స్నేహ ♦ మెనయఁదనకుఁ దా
నిక్కడికి వచ్చెనట తమి, యెక్కడిదో! నాదుభాగ్య ♦ మేమనవచ్చున్

క॥ కాకుత్థ్సతిలక! నాతో, నీకుం జెలిమి యొనరింప ♦ నెఱిగలదే నిం
నాకయి బెట్టుమ నీకయి, నాకయిని దెచాచినాడ ♦ నరనుతచరితా!

[రామ సుగ్రీవులగ్ని సాక్షిగాఁ జెలిమి చేయుట]

క॥ శ్రీకరుఁడు రాముఁ డాపలు, కాకర్ణించి తన కేలు ♦ ఖరకరసుతుగ్రై

జోకనిదైవశోకసంప్రవృత్తముగనర్చి మైత్రి • బరిరంభించెన్

వ. అప్పుడానాంజనేయుండు సుమంబులం దెచ్చి వహ్నిరగిల్చిన, దశరథాదిత్యనందనులు, సుమనంకలనిల్చి, విద్యుక్తక్రమంబున, నగ్ని హోత్రుంబూజించి ప్రమోక్ష, నేనిబంగ్నసాక్షిగ లిపి, యొకరొకరివాచినట్లు, గడపుగొన్నట్లు, మేనం బులకాంకురంబులు జామకో నిండుమతింగాంచుచుండ, సుగ్రీవుండు, రామునిఁగాంచి, దేవా! నేస్తంబునియట్టి జగత్ప్రభువు నర్మిలింగలిసి నట్టి, నింకమునయిరువుర సుఖదుఃఖంబులు నైక్యంబుజెందె, మనకిబ్బట్లకదా! కార్యంబులట్లు నెరవేర్ప వలయుం గదా! యని, యిట యభావిఫలసూచకంబనినట్లు, లోకఫల పుష్పదళ సమాకీర్ణంబయిన శాఖశాఖంబెదికివయిచి రామునందు గూర్చుండబెట్టి తదాజ్ఞ, దానునమ్మహీజాని నొరసికూర్చున్న హనుమంతుండు నట్లో నర్చి లక్ష్మణుంగూర్చుండఁబెట్టి తానుగూర్చున్నంత సూరపుత్రుండు, దశరథపుత్రున కిట్లనియె.

చ॥ నరవరనందనా! త్రిదశ • నాయకనందనుఁడంగనం, గపీ
శ్వరవరరాజ్యలక్ష్మి నిన • వారితబల్మి హరించిన న్మద
త్పురవరమందు నిల్వకయి • బ్భూమ్మని వే వెడలంగ నూక నీ
ధరవరమందు నిల్చితిఁగ • దావగదాయగఁ దాపరింపఁగన్ 133

తే॥ ప్రెగ్గడలు నేను నసురులు • బిగియబట్టి
వాలిదర్పంబు వెన్నంట • వచ్చియుండ
నుంటిమి భవత్కృపామృతం • బాడలజల్కి
భక్తవత్సల! కావవే • పగఱందోలి 134

వ. అంత రాముఁడిట్లనియె. 135

మ॥ భయముం జెందకు మర్కనందనభవ • ద్భ్రాతన్ ధరం గూల్చి వి
స్మయముం జెందఁగ కపీంద్రులెల్ల సుస్వరా • జ్యంబాడు నిన్నిల్పెదన్
జయముం జెందుదు వేటికీవడలనీ • జాయామణిం గూడెదీ
నయముం జెందుము నీవు చూచెదవుగా • నా హైనదోఃపాండితిన్ 136

తే॥ ఇట్లు సేయని నాఁడు మ • మ్మొలమిఁ గన్న

తండ్రిపాదాబ్జములకేను • దప్పువాఁడ
జుమ్మనేనేలలక్ష్మణుఁ • డిమ్ములఁగొని
గేలిమెదునుమఁగలేఁడొ • వాలిఁగీలి 137

వ. అయ్యెడ 138

ఆ॥ వనజకనకవహ్ని • భాసురములగుసీతావనాటరాజ • దైత్యరాజ
వామనేత్రములుజ • వంబుననదిఋధ, రాధరేంద్రపుత్రి • రమ్యగాత్రి 139

వ. అనినవిని 140

సీ॥ మన్ననఁబల్కెన • మార్తాండపుత్రుండు
రాముతోజగదభి • రాముతోడ
మన్మంత్రిమణిహను • మంతుండెఱింగించె
ననఘుమిారిటువచ్చి • నట్టిజాడఁ
తమ్ముండుసీవువ • నమ్మనఁదిరుగాడ
సీతతోసుగుణస • మేతతోడ
మాయాజలమ్మున • మానియైరావణుం
డవనిజఁగొంపోవ • నామెజాడ
తెలియకెల్లెడరోయుచో • దిటవువీడ
వెలయనంతఁగబంధుండు • దెలుపుజాడ
నాదుపుణ్యవశతమిారు • నన్నుగూడ
నరుగుదెంచితిరడలకు • డరయువాఁడ 141

క॥ ఉండినస్వర్గపురంబున, నుండినబాతాళమునమహో • ర్వీస్థలినై
నుండినఁదెత్తువనిజ కాకుండినరవిపాదమాన • యురుగుణధామా ॥

ఉ॥ వేల్పులుప్రాతవేల్పులోక • పెట్టునరావణుదిక్కు రాసతోల్
వేల్పులతేఁడుసీతనల • వేల్పులబోనపుటింటఁడాపసీ
క్రోల్పులులందుబెట్టనియ • కుంఠితవహ్నినిడంగనీమహా
నల్పులమంత్రులంబనుప • నాజెలిదేనముదబ్ధినీదనా 143

[సుగ్రీవుఁడు రామునకు సీతజాడ నెఱింగించి]
తదాభరణాదు లొసంగుట

చ॥ వలువరుమంత్రు లేనునొక • నాఁడిటనుండఁగ నాకసమ్మునం
బలువడిబోవు రావణుని • స్వర్ణసుపుష్పకమందు నెక్కి తా
చెలువలమిన్న రామగుణ • సీమనతావనఁ లక్ష్మణా వెతం
బిలువఁగఁబల్కి రేలయని • బిట్టుగ నేడ్వఁగఁగంటిమెంత యేన్ 144
ఉ॥ ఇప్పుడె టెంగి కైదశర • థేశ్వరనందన! యామెసీతగా
నప్పుడెసీతమమ్ముఁగని • యాభరణమ్ములఁజీర చెంగునం
జప్పునముడ్చి మాకడ వై • సంబడ్వె చినఁడాచినాడనీ
యొప్పులకుప్ప వే మొకను • మోపికతోఁడుతఁదెత్తు నావ్రుమ్ 145
తే॥ గుబ్బ్లిన్లిస్త్రుల్కి కొంచురా • కొమరుఁడర్కి
యేలకాలవిలంబన • మిందువదన
భూష లేవనఁ దెప్పించి • పూషజుండు
నివెకనుమటంచు ముందుంచ • నెసగు వెతను 146
ఉ॥ వానినిగాంచి రాఘవుఁడు • వారణయానఁ దలంచియట్టి హా
మానినియంచు దుఃఖమున • మాటికినాఙట పాటనూర్చైన
వ్వానినిఙొమ్ము చెక్కఁగవ • పైనిడిపుట్టలనాగు బాము లెం
తేనినిటూర్పునూర్చు కర • ణిందరిదమ్ముఁడునర్కి కుందఁగన్ 147
వ. అంత నాహారోన్నగల తెగల ముద్గుతమ్మునకుంజూపిన రామ! నిత్యం బునామహాదేవి పదపద్మమ్ముల కంజలిజల్ప నేగి కాంచువాఁడ నేను నె ఱుంగనే హారోన్నందియలు మొదలయిన వానినని కొంతవడిదుఃఖించి యన్నమారార్పనంత రాముండు సుగ్రీవా రావణుండెందుండెనో తెల్పు మాయఘమతి ఖండించి దేవిందోడ్తెత్తునన రాము నెట్ట కేలకుప్రొద్దు పట్టేయూరార్చి యిట్లనియె. 148

[సుగ్రీవుఁడుసీత దెచ్చుట పొంతెప్రతిజ్ఞఁదీయుట]

ఉ॥ దేవ! మహానుభావ! భవ • దీయసతీతిలకాపహారిదా
చేనయుశక్తియుంగొలము • జెన్నగుపీడు నెఱుంగనైననా
లావరిఁబుత్రమిత్రయుతు • లాఘవమారనశింపఁజేయుచున్
నీవరవర్ణినీమణిని • నీదరిఁ జేర్చునినాఁడువీఁడుసు

తండ్రిపాదాబ్జముల కేను • దప్పవాఁడ
జుమ్మ నే నేలలక్ష్మణుఁ • డిమ్ములఁ గొని
గెలిమెదునుమఁగ లేఁడొ • వాలిఁ గేలి 137

వ. అయ్యెడ 138

ఆ॥ వనజకనకవహ్ని • భాసురములగు సీతావనాట రాజ • దైత్యరాజ
వామనేత్రములు జ • వంబున నదితెఢ, రాధ రేంద్రపుత్రి • రమ్యగాత్రి 139

వ. అనినవిని 140

సీ॥ మన్ననఁ బల్కన • మార్తాండపుత్రుండు
రాముతోఁ జగదభి • రాముతోడ
మన్మంత్రిమణిహాను • మంతుండెఱింగించె
ననఘ మీరిటువచ్చి • నట్టిజాడఁ
తమ్ముండు సీవ్రువ • నమ్మునఁదిరుగాడ
సీతతో సుగుణస • మేతతోడ
మాయాబలమ్మున • మానిమై రావణుం
డవనిజఁ గొంపోవ • నామెజాడ
తెలియ కెల్లెడరోయుఁచో • దిటవుపీడ
వెలయనంతఁగ బంధుండు • దెలుపుజాడ
నాదుపుణ్యవశత మీరు • నన్నుగూడ
నరుగుదెంచితిరడలకు • డరయువాఁడ 141

క॥ ఉండిన స్వర్గపురంబున, నుండిన బాతాళమున మహో • ర్వీస్థలిపై
నుండినఁ దెత్తువనిజ కాకుండిన రవిపాదమాన • యురుగుణధామా॥

ఉ॥ వేల్పులు ప్రాతవేల్పులొక • పెట్టున రావణుదిక్కు రాసితోల్
వేల్పుల జేఁడుసీతనల • వేల్పులబోనపుటింటఁ డాపనీ
క్రొల్పులులందు బెట్టసియ • కుంఠితవహ్ని నిడంగ నీమహా
నల్పులమంత్రులంబనుప • నాజెలి దేనముదబ్ధి నీదనా 143

[సుగ్రీవుఁడు రామునకు సీతజాడ నెఱింగించి]
తదాభరణాదుల నొసంగుట

చ॥ నలువురుమంత్రులేనునొక • నాఁడిటనుండఁగ నాకసమ్మునం
బలువడిబోవురావణుని • స్వర్ణసుపుష్పకమందునొక్కతెం
చెలువలమిన్న రామగుణ • సీమనతావనలక్ష్మణావతం
బిలువఁగఁబల్కుకేలయని • బిట్టుగ నేడ్వఁగఁగంటిమెంతయేన్ 144

ఉ॥ ఇప్పుడెఱింగితిన్ దశర • థేశ్వరనందన! యామెసీతగా
నప్పుడెసీతమమ్ముఁగని • యాభరణమ్ములఁజీరచెంగునం
జప్పునముడ్చిమాకడవె • సంబడవైచినఁడాచినాడనీ
యొప్పులకుప్పవేమొకను • మోపికతోడుతఁదెత్తునావుఁడున్ 145

తే॥ గుడ్లనీర్గ్రుక్కుకొంచురా • కొమరుఁడక్కొ
యేలకాలవిలంబన • మిందువదన
భూష లేవనఁదెప్పించి • పూషజుండు
ని వెకనుమటంచుముందుంచ • నెసగువెతను 146

ఉ॥ వానినిగాంచిరాఘవుఁడు • వారణయానఁదలంచియట్టెహా
మానినియంచుదుఃఖమున • మాటికినాఱటపాటనూర్చిన
వ్వానినిఱొమ్ముచెక్కుఁగవ • పైనిడిపుట్టలనాగుబాములెం
తేననిటూర్పునూర్చుకర • ణిందరిదమ్ముఁడునర్కకుందఁగన్ 147

వ. అంత నాహారొన్నగలతెగల ముగ్గుతమ్మునకుంజూపిన రామ! నిత్యంబు నామహాదేవి పదపద్మమ్ముల కంజలిజల్ప నేగి కాంచువాఁడ నేనునెఱుంగనే హారొన్నందియలు మొదలయిన వానినని కొంతవడిదుఃఖించి యున్ననూరార్పనంత రాముండు సుగ్రీవా రావణుండెందుండెనో తెల్పుమాయఘుమతి ఖండించి దేవిందోడ్తెత్తునన రామునెట్ల కేలకుప్రొద్దుపట్టియూరార్చి యిట్లనియె. 148

[సుగ్రీవుఁడుసీత దెచ్చుట పొంటె ప్రతిజ్ఞఁదీయుట]

ఉ॥ దేవ! మహానుభావ! భవ • దీయసతీతిలకాపహారిదా
చేవయుశక్తియుంగొలము • జెన్నగువీడునెఱుంగనైననా
లావరిఁబుత్రమిత్రయుతు • లాఘవమారనశింపఁజేయుచున్
నీవరవర్ణినీమణిని • నీదరిఁజేర్చునినాఁడువీఁడుసు

గ్రీవుఁడ! పద్మినీధవుని ♦ కింబ్రియపుత్రుఁడనీకుమిత్రుఁడా 149
ఉ॥ నీవును దమ్ముఁగుఱ్ఱఁడువ ♦ నింజరియించెమపట్టునకారమా
దేవికినీమనచ్ఛేమస ♦ తీమణిఁబ్రముచ్చిలినట్టియాదశ
గ్రీవునిఁగూల్పనీకనిన ♦ రీతినటింపనినాఁడువీఁడుసు
గ్రీవుఁడపద్మినీధవుని ♦ కింబ్రియపుత్రుఁడ!నీకుమిత్రుఁడా 150
ఉ॥ నావిమతుండురంబునన ♦ ణంచినతింగొనిరాజ్యమేలుచున్
నీవిమతున్ ధరాస్థలిన ♦ నింబడమొత్తిపడంతిదేగబల్
కీవిని నీకుఁదోడుగను ♦ డీకొనకుండినవాఁడువీఁడుసు
గ్రీవుఁడ పద్మినీధవుని ♦ కింబ్రియపుత్రుఁడ నీకుమిత్రుఁడా? 151
ఉ॥ చేవదొలంగనేలమది ♦ చేడియకైదురపిల్లనేలయీ
పావనిఁబంపినీదుప్రియ ♦ భామినియుండినచోటెఱింగి ని
న్నావనితాశిరోమణిర ♦ యంబునఁగూర్పనినాఁడువీఁడు సు
గ్రీవుఁడపద్మినీధవుని ♦ కింబ్రియపుత్రుఁడనీకుమిత్రుఁడా 152
ఉ॥ నేవనితందొలంగనెవ ♦ నింజరియింపనెవీఁడువీడనే
లావరివీవునాపురన ♦ లాతులుమాన్పెడువారెచూడనా
లావవసీసుతంగొనక ♦ లంతిగవచ్చిననాఁడువీఁడుసు
గ్రీవుఁడపద్మినీధవునికిం ♦ బ్రియపుత్రుఁడనీకుమిత్రుఁడా 153
వ. ఇట్లు పలికిన నాలించి సూతునకు శౌనకాదు లిట్లనిరి 154
క॥ సూతాసుజ్ఞానకళో పేతారవిజుండుతనదు ♦ పెంపెన్నెడునే
లాతారాపతిదాడికి నాతఁజెలావలఁజేచనండె ♦ యదియేమన్నన్ 155
వ. అనిన సూతుండిట్లనియె 156
చ॥ ఇటులమగంగగారికి ♦ మహేశ్వరుఁడన్నటులేనుబల్కెదన్
జటిపరులారవిన్దగుని ♦ ఱమ్మగవాలినిభానుజుండుము
న్నటులెదురింపజాలకయ ♦ యాగగలేదుస్వకీయుఁడంచుదా
గుటిలతఁబూనకుండెనతి ♦ గోల్పడిపూనెవిరోధమన్నపైన్ 157
ఉ॥ కూరిమినేస్తితద్విధిని ♦ గొమ్మనురోయగబంపుదంచుద
న్భేరిమిదేర్పరాఘవుఁడ ♦ నెందపనాత్మజవిన్మనింకనే

నెఱిగలచెలి పరమగతిగ • ణింపఁగ రామా! 164

సీ॥ గూఢంపువర్తన • కు నయోమయపుబేటి
మేలకీళ్ళెఱిగించు • మేటిచేటి
పాలుపారఁగాఁ బ్రొద్దు • బుచ్చు విప్రవినోది
వైరివారణముగూల్చు • గజభేవి
గొప్పకార్యమునమ • కూర్పపరుసవేది
పాయనిలేమిముల్ • దీయసూది
సౌఖ్యదుఃఖములమా • చగలట్టి తక్కెడ
యాపదలణఁగింప • నౌషధపడ
తే॥ ఆత్మపోషణకుంబెట్ట • నట్టికోట
శంకలందీర్చి నడపింపఁ • జాలుబాట
యైజనావళికుపకారి • యైనసుజన
మైత్రిమించినదొకఁడే ది • క్ష్మాతలమున ॥ 165

ఆ॥ అక్కపల్కులెల్ల • నాలించి శ్రీరాముఁ
డంజనీసుతుండు • ననుగుదమ్ముఁ
డైనలక్ష్మణుండు • నాలింపవానివే
భంగులొక్కమొగిని • బ్రస్తుతించె ॥ 166

(సుగ్రీవుఁ డన్నకుఁ దనకుఁగల్గిన విరోధకారణము దశరథుల కెఱిగించుట.)

తే॥ మఱియు రామునకర్క సం • భవుఁడువలికె
వీసువెడలంగగొట్టి నా • వెలదిబట్టెఁ
దరుమసాగెనువాలి, గో • త్రమునఁబసితి
నార్తనాథునిరామ న • న్నరయుమెట్టొ ॥ 167

సీ॥ రాజువాలిగయువ • రాజునునేనుగా
నుంటిమికొన్నాళ్ళు • నంటినతమి
నంతటనన్నెన్నో • యనరానిమాటల
నొక్కమ్మడిగనాడి • యొక్కనాఁడు

ప్రాణాన కెనయైన • ప్రాణేశ్వరినిగొని
చెఱసాలనావారి • నఱవఁద్రోచి
పదపడినాతల • ప్రాణమ్ము తోకకు
వచ్చెలాగేడ్పింప • జొచ్చెనన్ను
తే॥ విడక నాపైనిజంపంగ • వేసెఁగన్ను
చక్కనెన్నేయుపాయముల్ • సంతరించెఁ
బన్నె నెన్నేనియుక్తుల • జెన్నటిమదిఁ
జెప్పవశమౌనె యాపాపి • సేయుకీడు ॥ 168
ఆ॥ పంపబంపనాడు • పైకిసేనలవారి
జంపజంపనరిగె • జాలకాల
ముందుచేత సిర • లరుదేరమేమెల్ల
నళుకవలసె భీరు • డళుకఁడొక్కొ ॥ 169
క॥ వనచరవరేణ్యుఁడగు నీ,
హనుమంతుండు మొదలైన • యాత్మసచివులి
వ్వనమున జతగావిరుగఁగ
మనుచుంటిని రామచంద్ర! • మలయిలుగాఁగన్ ॥ 170
క॥ నిలిచిన సిలుతురు వెలలిన,
వెలలుదురమ్మంత్రివరులు • వెంటనె జతగాఁ
బలుపాట్లువడిరి నాకయి,
కలునను నాప్రాణమిపుడు • గాచిరిసుమ్మీ ॥ 171

ఉ॥ హాళిని నెన్నికష్టముల • నందితినో తెలుపంగఁజాల వె
సాలిని లేను నీకిపుడు • సంగ్రహశక్తిని బల్కినాడ న
వ్వాలిని వానిసేన నిల • పైబడగూల్చినగాక నాదు కాం
తాళిసికూడి కూర్కెదనె • హాయిని రామ! యదేటిమాటలే ॥ 172

క॥ బిట్టలమినకష్టమ్ముల, నిట్టలసటఁబలుకనలసె • నెంతయునీకీ
పట్టునసుఖియోదుఃఖియొ, నెట్టనస్నేహితుఁడదిక్కు • స్నేహితునకటన్

కవిరాజ వినివిని శ్రీరఘు♦వీరుఁడునర్కజు♦ వేసటమాటల♦ వేమరునా
విరా॥ తనికనుసూర్యసు♦తా!మునునీకుశ♦తక్రతుసూతికి♦ తంబుననుం
డిననెటుఁగల్గెగ ♦ డిందివిరోధము ♦ డీకొనబల్కి-పు ♦ డే తెలియఁగ
మనమునశోకము♦మానుముధీరుఁడు♦మాటికిగుందుట♦మంచిదొకో
కవిరా మొగినిబలాబల♦ముల్ మదినారసి♦ మోసలకార్యము♦బోణిమిగా
జవిరా॥ దగినటుజూతము♦తావకరీశక♦ధక్ వినునాకు నె♦దంగినుకెం
తగనోజెలంగెను♦దామరనీడటు♦నామదిచంచల♦తంగనెనీ
పగతుడనాపగ♦వాడనినమ్మము♦వానరనాయక♦భావములో
క॥ ఎన్నఁగవిలుమోపెట్టక, మున్నువచింపైంద్రివైర♦ మునకుఁగతంబుం
బన్నగరాణ్ణిభశరమా, సన్నంబై నగిపునడచి♦శరధింజొరుఁజూ ॥
వ॥ అనిన నమ్మాటలకు మార్తాండనందనుండలరి యిట్లనియె. 177
సీ॥ బ్రహ్మకుమారుండు ♦ బ్రథమవృక్షచరుండు
నగుబుభుక్షవిరజునీ ♦ కఘరనాథు
నంశంబుననవాలి ♦ యర్కాంశమునె నేను
గలిగి తండ్రికిముద్దు ♦ గొలుపుచుండ
మజ్జనకుఁడుతపో ♦ మార్గంబునమెలంగఁ
దలచిపెద్దకొమారు ♦ దనదుగద్దె
నిలిపి పిన్నకొమారు ♦ నెలమినన్యువరాజు
గానిల్పి చనెహొన్ను ♦ గట్టుకడకు
గీ॥ నేనుభక్తినిగొలువగా ♦ నియతినేల
వృక్షచరరాజ్యమెంతేని ♦ నివలవాలి
యవలమాదురదుష్టద ♦ శవలననల
మఁనునిసూనుఁడు మాయావి ♦ మదముశేగి ॥ 178
చ॥ ఒకమెలనాగకయ్యపగ ♦ నూని మదీయపురంబువాకిటం
బ్రకటముగాగ నార్వవిని ♦ వాలిజితారి తదీయదైత్యుపై
నొకఁడురుకంగ నేనరిగి ♦ తొయ్యనగూడ సురాభియాతి య
ట్లోకగిరికందరాన జొర ♦ నోడకనన్నటనిల్పి వాలియుఁ ॥ 179

చ॥ వెరుచ నెనంత నేను కనిపెట్టి ♦ యొకబ్దనుటుండవచ్చె న
ప్పెనుగుహవాత నెత్తుదు న ♦ ఫేనముగా నటదానవార్భటుల్
వినఁబడెవాలిపల్కాకఁ ♦ డు విన్బడకుండె నటాలకించినం
బనవృచునేను నవ్వెనుక ♦ వాలినశించెనటంచు నెంచుచున్ ॥ 180
మ॥ పురముం జేరి తిలోదకాలొసగి నే ♦ భూరివ్యథన్ర్మగ్గ ద
ద్వాఃమంత్రుల్ కపిరాజ్యమందునను ని ♦ ల్పన్వచ్చెమాయన్న స
త్వరతం దద్రిపుబ్రుత్రమిత్రయుతు జి ♦ వ్వంగూల్చి రాయన్న! ని
ర్జరవైరిం మనుమాడివచ్చితె యిదే ♦ రాజ్యంబునేల్కొమ్మనన్॥
క॥ "బడ్డువిరిగి యొన్కమ్మడి, బడ్డపగిది" నాదుపైన ♦ బడితిట్టినను
జడ్డనవెళ్ళదరమె నే, "గడ్డముబట్టిబ్రబతిమాలఁ ♦ గా" వినడయ్యెన్॥
క॥ కొట్టెను తిట్టెను బురికడ, నెట్టెనునావారినిజెఱ ♦ నెట్టెనుదిప్పల్
బెట్టెను నాభార్యను జే, పట్టెను నిర్దయతనింద్రు ♦ పట్టిక్షితీశా! ॥
క॥ నన్నింతకష్టపెట్టిన, జన్నుఁబుగాపరి!యెనుర్ప ♦ జాలకగాదే
నన్నకదాయని దురమున. కున్నడువకయుంటినంచు♦ గోడెత్తంగన్
క॥ వినిరాఘవుండురవినం,దనునకుబల్కర్క నంద ♦ నా! నీవెతలె
ల్లను నావెతలేటికడల, నినుఁగాచెదనన్ననర్క ♦ నెఱిజేనికనున్ ॥
క॥ శ్రీరామచంద్ర!వజ్రిసు, మారాగ్రణి బలపరాక్ర♦ మమ్ములువిని మీ
రారూఢిసేయదగినటు, నేరుపుమైసేయవచ్చు♦నియతిననియనున్ ॥
క॥ కొండలగైకొనియచ్చన, గండ్లుంగానాతఁడాడు ♦ ఘనబలుడసితన్
గొండాడనెల్లవారలొ, కంమభయంబన్ననవ్వ ♦ గదభీలేమిన్ ॥
వ॥ మఱియును 188
ఉ॥ తూరుపుసంద్రమందుఁ గోల ♦ దూలగస్నానమొనర్చి వార్చి యా
పై రహిదక్షిణాబ్ధికి జ ♦ వంబుననేగి కడంకగ్రుంకి త
ద్వారిధిదాటి పాశిదిగ ♦ సాంపతిమున్గి యుదీచివార్ధికిం
గోరికనేగి క్రుంకులిడి ♦ గొబ్బునవచ్చును మన్కిపూర్వకున్ ॥ 189
క॥ దినదినమిటుసూర్యోదయ,మునకుంబూర్వంబువోయి♦ మొగిగష్టము
నా। కనఘావచ్చుచు గైదం డవఱకుఁబలిమెరుకపడవ ♦ నక్షితిజముఁన్॥

వ॥ వెండియు, 191

సీ॥ తొలివేల్పుసొన్నార ♦ తొలుచూలునకుమున్న
తద్భ్రాతసైరిభ ♦ తనువుదాల్చి
దొడ్డకేకనువేసి ♦ దురమునకుంజీర
మాయన్న రేనాఁక ♦ దాయఁదాకి
కొండలదరువుల ♦ గొంతసేపటుపోరి
దానిశృంగమ్ముల ♦ బూని కేల
నేలగొట్టియడంచి ♦ నిగిడియోజనదూల
మువిసరివేయగా ♦ మునిమతంగు

గీ॥ నాశ్రమోర్విజములు ♦ నడగంగబడిదాన
నెల్లజాలుకొల్పె ♦ నల్లవాక
దానిగాంచిమౌని ♦ తత్కారణంబెంచి
వాలియిందుఁ రాగ ♦ గూలుననియె 192

క॥ ఏతత్కారణమునఁగపి, నేతయిటకురాఁడుగాన ♦ నేనిల్చితినో
సీతాపతి!యీతావున, నాతారేశునకునోడి ♦ హాళిగదురగాన్ ॥

క॥ దానవుకళేబరంబిదె, మ్రానోకొండో యనంగఁ ♦ గ్రాలుంగను మా
పైన సతతాడులంగను, వానినిగై వంచిపండ్లు ♦ వాలిభుజించున్ ॥

ఆ॥ పూసగ్రుచ్చినట్లు ♦ వాసవనందనుబలపరాక్రమములఁ ♦ బల్కినాఁడ
నీకువాని నెట్లు ♦ నిర్జింపఁగూడునో బల్కునాకురామ! ♦ బ్రధనభీమ॥

క॥ నావుడులచ్చననగి సుగ్రీవుఁడ! యితఁడేమిసేయుఁ ♦ గీశవరేణ్యున్
లావుమెయిదున్మఁగలఁడని, నీవు మదిన్నమ్ముదన్న ♦ నెఱినాతఁడనున్

మ॥ ఒకహస్తమ్మున దాళసప్తకము నే ♦ ర్పొప్పారగావంచి, కొం
డొకహస్తమ్మున పండ్లుమల్చితినునో ♦ హాహానాగగవ్వార ల
ట్లొకబాణమ్మున సప్తతాళముల నే ♦ ర్పొప్పారదున్మాడి గొం
కకఁ బాదమ్మున దైత్యుదుందుభి మహా ♦ కాయమ్మునెకూల్కున్

క॥ ఇరునూరువిండ్లదూరము, నిరుపమగతిమీటెనేని ♦ నేనమ్ముదునం
చురుగుణుఁడునర్కివలుకుచు, గరుణానిధిరాముగాంచికడులొంగియనున్

క॥ వాలివినిర్జితదానవపాలి, విఘూర్ణితరిపుసైన్య • పాళివితతదో
శ్శాలి వికాసితవిక్రమ, శ్శాలివిభుతకోఁడియుంటి • శైలంబాదుఁ ॥
క॥ అని కన్నీరున్నించిన, గని రాముఁడు ప్రొద్దుకూనఁ • గరుణదొలుక వే
డ్కనిలపుమర్కజ! నీరిపు, దునిమిత్వదీప్సితముదీరు • తున్నే ననియెఁ

[రాముఁడు దుందుభికళేబరముఁ బొట్రవేలఁజిమ్మి
తాళసప్తకం బొకమ్మునంగూల్చుట.]

మ॥ ఇటులూరార్చిదివాకరాత్మజునిరా • జేంద్రుండుతత్కాయముం
బొట్రవేలన్వడియోజనంపుదశకం • బుంబొఱఁగామీఁబెద
త్పటుసత్త్వల్ కపికుంజరుల్ వొగడఁగాఁ • దాఁదూలికంబోలెను
త్కటసత్త్వండగునర్కదానిగనిజో • కన్ రామునితోనిట్లనున్ 201
ఉ॥ రామతదీయకాయముసు • రప్రభుసూనుఁడుజిమ్మనాఁడుప్రో
ద్దామతరంపుమాంసమునఁ • దవ్వుకనరక్తమునంబ్రపూరితం
బై మఱియుండెవాలియు • దదాహవమందునడస్సియుండెని
ష్ఠామఱినట్టిశుష్కముగ • దాయిదికాపునన మ్మనిన్నికన్ 202
క॥ అప్పుడుమాంసోపేతం, బిప్పుడుమాంసరహితంబు • నీరిరువురలో
జెప్పుడులావరియెవ్వరొ, ఇప్పుడునేనెరుగనేర • కిట్లంటినృపా 203
క॥ ఈకార్ముకమునచిల్కడి, యాకర్ణాంతముగదిగిచి • యగములొకే
నీకంబుడమింగూల్చిన, చోఁగౌశికీశిష్యయీవె • పోయెక్కువికన్
ఉ॥ అనవినితాటకాంతకుఁడ • హస్కరసూనుఁడునమ్మనట్లుగన్
ఘనతరకార్ముకంబొకఁడు • గైకొనికాంచనపుంఖమార్గణం
బునుఁదొడిబిట్టులాగినగ • ముల్గుఱిజూపివడిన్విడెంగుణ
స్వనమునవెల్లదిక్తటులు • బ్రస్ఫుటరీతినిమారుమ్రోగఁగన్ 205
శా॥ ఆతండమ్మువిడంగనిట్లదియుఁదా • ళ్యారొండునంతంతభూ
పాతంబై చనజేసియంతటవడిం • బాతాళగంగందగం
జేతంబుబ్బగస్నానముంజలిపియా • శ్రీరామునమ్ముల్ పొదిం
నీతంబారఁగఁజేరెఁజూపరులునెం • తేవేడ్కఁగొండాడఁగాన్ 206
క॥ ఈగతినగముల్గూరినిడి, వేగమునేయఁగఁదాళ • వృక్షము లేడుం

దూగిపడగాంచిరవిజుఁడు, భోగిశయానుండొయంచుఁ బుద్ధిందలఁచెన్

వ. ఇట్లతండు 208

ఉత్సాహ పాణియుగముమోడ్చిచక్రపాణిసముఁడవయ్యయం
చాణిముత్తెపున్నరులుగల ట్టిరుపేటురమిలం
బోణిమిగనుపొక్రమెక్కి భూమిజామనోహరా!
వాణిమెఱయగెల్పుపీవె వాలిగిలిలెక్కయే 209

క॥ అనిపలువితములరఘురా,మునిదోర్విక్రమమువొగడి • భూమీశనను
గనికరమునగనిగావవె, వినిహాతుగావించివాలి • వేగమయంచున్ 210

క॥ భూతేశసదృశబలునిను, నీతేశాపడసినాడ • స్నేహితుగానా
భూతేశుజెత్తియిటరా, నీతేలెదనన్నవాలి • నేలాతలపన్ 211

క॥ అనిప్రస్తుతించిరాఘవు, డనివాలివధించగల్గు • నని నెమ్మదిలో
నననమ్మినిల్చెననిప, ల్కినవ్వాలికతను దెలుప • గెరలించుటయున్

ఆశ్వాసాంతము గోమూత్రికాబంధము

క॥ తారధరాధరధీరా! శారదనారదవిభాళి • సమవిమలయశా
ధీరవరాదర!వీరా!సారఘనాంబుదశుభాఙ్గ • సమవిపులదశా 213

చతుర్విధకంద గర్భితమణిగణ నికరము

ధగధరపదరత • దయగనువరధీ వరకవిజననుత • వరగుణశరధీ
స్వరుధరవిభవసు • జనహితధరధీతరళనయనస్మర • ధనదవితరణా 214

మాలిని వరకవిజనరక్షా • వైరిసందోహశిక్షా పరమకృతిపరీక్షా • భక్తసంచారదీక్షా
హరకమలదళాక్షా • స్వచ్ఛమాల్యర్ధవక్షా • ధరణిదివిజపక్షా • దైవపాదాబ్జకాంక్షా

ఇది శ్రీమదుదచ్చాంద్ర శిరోభూష్య నిరవద్య నృగచరిత్రకృతిరచనాచాతురీధురంధర సద్వ
ంశోబంధుర కౌండిన్యగోత్ర కలితాపస్తంబసూత్ర చతుర్విధకవితామతల్లికాబ్జరాజాన్వ
యపయఃపారావారరాకా కైరవమిత్ర నృసింహామాత్యపౌత్ర మంగాంబాశేషా
చలామాత్యపుత్ర సుధీజనవిధేయ హనుమంత రాయనామధేయ ప్రణీతం
బైన శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకంబను మహాకావ్యంబునందు
చతుర్థాశ్వాసము.

• శ్రీసుగ్రీవపట్టాభిషేకము •

పంచమాశ్వాసము

క॥ శ్రీముత్యాం బామణిముఖ, తామరసాసితమదాళి • తలజరాజాం
బామణిగర్భజసద్గుణ, ధామపకీరయసనామ • తపనసుధామా

క॥ అటమీఁది తెఱఁగువిను, షుత్కటకరుణాంజంద్రధరుఁడు• గాళికిక్షితిభృ
త్కటకమునను షుపవషున్రస, నటసూతుఁషువలికెమునుల•కవలికతవినఁ

[ సుగ్రీవుఁడన్నంగెడిపితన్ను గావరఘురాము వేఁడుకొనుట ]

ఉ॥ అంజలిఁజల్పిరామునకు • నర్కజుఁడప్పుడురామచంద్రనా
నెంజలివాపివాకునయి • సిర్జరనాయకసూతిఁద్వచ్ఛరా
గ్నింజవికుర్వ్యగూల్చికృప • నింపఁగ దేయనివేడినన్మదిఁ
రంజిలిరాముడిట్లనుగ • రమ్ములగ్రుచ్చికవుంగిలించితాఁ 3

క॥ ఖేదముడుగుకిష్కింధకుఁ, బోదముపదబిల్వ్యమింద్ర•పుత్రునిఁద్వరగా
వాదమునకుజలుపుముహరి, నాదముఁదద్వారసీమ • నభమఁగలంగఁ

[ రామసుగ్రీవాదులుకిష్కింధపయినెత్తి వెడలుట ]

సీ॥ మిత్రాత్మజుంషుసు • మిత్రాత్మజుంషు
ముస్మున్నుగామార్గమ్మ • మొగినిజూప
నలనీలపవమాన • నందనతారులు
బ్రక్కలభటకోటి పగిదిదోప
స్వర్ణభూషితశరా • సనము
లర్కాభ బాణమ్ములుర్వీశచి • హ్నములుజూప
బత్రపుష్పఫలప్ర • భాసమానోర్వీజ
నగనదుల్ కనుపండు • వుగనుదోప
దేవతాస్త్రీజనోపేత • దేవఘాతముల
కుసుమమంజరీకుంజ • పుంజవాత
చళితపుష్పదళాంతర • స్థానచకిత
భృంగఘాతకుసుమగంధ • బృందవిభుతి 5

క॥ దరచక్రమత్స్యరేఖల, సరసార్మికకంకణములఁ • జానగుపద్మా

కరములఁ జోలినపద్మా, కరములనుత్తుంగశృంగ ♦ కలితాగములన్

చ॥ మదజలధారలన్మధుప ♦ మండలితృప్తివహించివాదముల్
పదపడిసేయఁగర్ణములఁ ♦ బాఱఁగఁదోలుచుఁబాదఘట్టనన్
బెదరిమృగాళివాఱఖగ ♦ బృందముమింటనుఁగ్రేస్సృవాఱఁగా
మదగజబృందముల్సరసి ♦ మండలితీరములంజరింపఁగన్ 7

ఉ॥ తొండములంజలంబులన ♦ ఘోగతిబీల్చిసమీపనాగముల్
గండములందుఁగుంభములఁ ♦ గ్రక్కునఁజిమ్ముచుదన్మృణాళపుం
గాండములంబెకల్చితమ ♦ కైమెడలంగయిసేయుచున్భుజా
దండములంస్వవంశజుల ♦ దాకుచువారివిహారమర్మిలిన్ 8

క॥ హత్తిపదుపుజరుపఁగమద,
మెత్తిపదుపులగుచుఁగూడి ♦ యేమలుగుమ్మల్
మొత్తిపడద్రొబ్బిరాల్చిన
ముత్తైపురాసులనుతేఁడు ♦ బొరిగనుచవలన్ 9

[రామునకుసుగ్రీవుడు గదళీవన ప్రభావంబు దెల్పుట.]

క॥ కదళీతరుషండంబుల
బొదలెడువనమొకడుగాంచి ♦ భూమిపుడర్కిన్
ముదమునగనిపల్కున్నె
మ్మదికవ్వనిముదముఁగొల్ప ♦ మఱిమఱివేడ్కన్ 10

సుగంధి సూర్యరశ్మిజొచ్చనీక ♦ జోకనిర్లుగమ్మనో
సూర్యపుత్రకాకడంక ♦ జుక్కలంటుగొమ్మలన్
దైర్యమారనేరుచొచ్చి ♦ నన్ముదమ్మునిచ్చునీ
యార్యవాసయోగ్యమైన ♦ యంటితోటయేరిదో 11

తరల అనగనర్కజుడిట్లువల్కుఁబ్ర ♦ యాణమర్మిలిజల్పుచుం
జనకజావరమున్ను ♦ సన్మునిసప్తకంబనిలాశనం
బునజలాంతరమందునిల్చిప్ర ♦ మోదమారమహావ్రతం
బునోగిసల్పిదివంబుజేరిరి ♦ భూరితేజములందగన్ 12

చ॥ సురవరులేనినిర్జరని ♦ షూదనులేనిబభీతినివ్వనిన్

ఘోరరరుదారనేఖగము ♦ నున్మృగముంఘోరదేగనేరమిం
మఱియుసుగీతవాద్యరవ ♦ మర్దళరావమువిఘ్నసౌబోరిం
బోరివలిగాలివీచునిట ♦ బొల్చునువహ్నులుమూఁడునెప్పుడున్ 13

క॥ గగనమునసలమితధూ
మగణముజలముగ్గణంబు ♦ మాద్రిగనెపుడున్
జగదీడ్యమగుచుమెఱయున్
భగణంబులనంటికప్పి ♦ భాభీప్రదమై 14

చ॥ అనఘచరిత్రనీవనుజు ♦ డమ్మునిరాజులకిప్డ్రమొక్కుఁడ
ఘ్లోనరుఁపగానరోగతను ♦ నుంమురటన్ననుసానుజుండునై
జనకసుతాధిపుండురహిఁ ♦ జాగిలిమ్రొక్కిహుటాహుటింవెసన్
వనచరరాజపట్టణవనమ్ములఁ ♦ జొచ్చిరియందఱాదటన్ 15

(సుగ్రీవుఁడన్నంజివ్వకుంబిల్చుట)

ఉ॥ అప్పుడుమంజుకుంజనిచ ♦ యావృతమైనవనాంతరంబునం
జప్పుడుగాకయుండక్షితి ♦ జానియుఁదమ్ముఁడునుండనర్కజుం
డప్పవిధారిసూతిబళి ♦ యాంబుదరావమునీడవుచ్చుబల్
గొప్పరవంబునంబిలిచెఁ ♦ గోటకుముంగలనిల్చిచివ్వకున్ 16

చ॥ అదివినివజ్రిపుత్రుఁడుద ♦ యాద్రినిఁదోచుదినేశుభాతిని
మ్మదిగినకంఠురంబునకు ♦ మందుచురాదుములంపుఁగయ్యమెం
చఁదగినపేరలిర్వురకు ♦ సాగెనభంబునసౌమ్యభౌముల
ట్లదరఁగఁజేయదిక్తటులు ♦ నాత్మమహాహవసింహనాదముల్ 17

క॥ కరికరిగిరిగిరిహరిహరి, బోరిబోరిదాకినటుదాకి ♦ పోరిరివారల్
మఱిమఱిరవరులిరుపురు, సరిసరియనిపొగడముష్టి♦సంఘాతములన్

వ॥ ఇట్లువ్రాయుచున్నంత 19

ఉ॥ లావరిరాఘవుండుకర ♦ లాఘవమారఁగఁగార్ముకమ్ముఁగై
జేనదలిర్పఁరాల్చిరహిఁ ♦ జేసియుసజ్యమువారలశ్వినీ
దేవతలట్లరూపమున ♦ దేజునదుల్యతఁగ్రాలఁవీఁడుసు
గ్రీవుఁడువీఁడువాలియని ♦ కేసయుసెంచఁగలేకభేదమున్ 20

(సుగ్రీవుఁడాహవంబున నోడిమరలఋశ్యమూకముం జేరుట)

ఉ॥ అంతటఁ బాణమున్విడువ • డయ్యెమహారమణుండునర్కజుం
డింతటిలోను రేంద్రసుతు • నేటులనొచ్చె కృపాబ్ధి రాముడ
ల్లంతటనుండఁగన్గొనక • నార్తిని బాఱెనువాలిదోలఁగా
నెంతటివాని జేరిన"నఁ • దృష్టవిహీనుఁ కబ్బు నేసిరుల్ 21

ఉ॥ ఈగతిఋశ్యమూకమున • కేగిన వెన్కఁ డివాసవాత్మజుం
డేగతి నేరకందుజేర • నీర్ష్యత వానికిఁబల్కె నిట్లుని
న్నీగతి లేక భీతినిట • జేరితి వేయనివాన రాధమా
మాగతిఁబోరెదేమడగి • మాటివిపొమ్మనిపోయెనింటికిన్ 22

సీ॥ రామలక్ష్మణులప్డు • రహిఁగొంజరిఁజు
దొట్టికోతులరానిజో • గులనుమించి
ఋశ్యమూకాద్రికి • నేతెంచిరవిపట్టి
మోళ్ళిలనిల్వనతండు • మోము వాంచి
వ్రీడతో శ్రీరఘు • వీరునితోఁబల్కె
నగచరపతిదాక • నన్ను బంచి
వైరిచేఁజంపింప • వచ్చినలాభంబొ
కింత లేదీరికి • నిటుపచించి
నదియొకండునొనర్చిన • యదియొకండు
నైననావంటివాఁడె • ద్దియైనయొండు
సేయనెర్చునె,"కంచెయే • చేనుమేయ
కాపికేమియొనర్చు,,నో • కౌసలేయ 23

[సుగ్రీవుఁడన్నందునుమమికి రాముందూరుట]

ఉ॥ ఎత్తికుదించివంచిపడ • నేసితిగోడనుమాటిసుద్దిలా
గిత్తఱిరామనిన్ననగ • నేటికినాదురదృష్టమేర్పఁగా
నత్తఱివాలిగెల్వగల • మాయనితేలగబల్కనయ్యయో
ఇత్తఱివాలినేబిలుతు • నేబలహీనుఁడుగెల్పుగోరునే 24

తే॥ మూలిగెడినక్కపైతాడి • బొండ్లమువడి

నట్లువాలికినోడి నే • నద్రిఁవిల్వ
లేనిపోఁ జెడదనిఁడి • తేనికేమ
టందునో రామ! సరసగు • ణాభిరామ!

(రాముఁడు వాలింజంపమికిఁ గారణము నుడువుట)

క॥ వేడినిటూరుపునార్చుచి, ఁటాడినిలువగాంచిరాముఁడనునన్నా నే
నోడినిలువ లేదాగ్రహ. మూడిచివినుకారణమిషు• వొఁగివిడువమికిన్

క॥ ప్రాయమ్మునరూపమ్మునఁ, గాయమ్మునవేషమునన•కంఠరవమునన్
నాయమ్ముగనొకఁడీరట, నాయమ్ముగడంకగనక• నాయమదోయన్

క॥ సరిసరియంగకములమీ రిరువురుగ్రాలంగనందు • నింద్రతనయునే
నెఱుగంగఁజాలకీగతి, మెఱుగుంజిల్కుపిడకుంటి • మీయన్నపయిన్

ఉ॥ మాటలఁ శోడఁబోదుగద • మత్కరముక్తశరమ్ము నేరి నేన్
దూటులు సేయకందనువు • దూపును సేవిడువంగనిర్వరం
దూటులు సేయునోఘనుని • నుంబడ మొత్తునెయంచుఁగొంకులోఁ
జాటిల వేయకుంటి రిపు•పై శర మోర్చుచుమిత్రరత్నమా! 29

ఆ॥ ప్రొద్దుపట్టినేస్తి • రూపుమాపిన పాప,పుంజమార్ప లేదు•పొంఁడుపాయ
మనిరిప్రాజ్ఞలిట్టి•లాలోచనము సేయ, కేజలుపఁగనవ్వ• రేజనమ్మ

క॥ ఏనునుసీతయుఁదమ్ముఁడు, మానుగనీకేలుఁదమ్మి • మాటుననిలువం
గానెంచివచ్చినారము, కానెమ్మదినెంచుమీవు•ఖరకరతనయా! 31

క॥ నమ్మమునావచనమ్మర, యమ్మనఁజనిమరలబిల్వు •మగ్రజుననికిన్
నెమ్మనిగురుతుగనిఁడుకం, ఠమ్మనగుసుమంపుబెత్తి• ణంతునువానిన్

క॥ అనిసౌమిత్రినిగని ల, చ్చనయుపెగజపుష్పలతిక • చక్కఁగబూచెం
గొనితెచ్చిదానిసుగ్రీ, వునికంఠమలంకరింపు • పో గుర్తుగనాన్ 33

క॥ వినిలక్ష్మణుఁడునద్దా, నినిదెచ్చి దినేశసూతి • నెఱిగుత్తుక వై
చిననతఁడువాలిచెవరిదిగ, ఘననక్షత్రగణయుక్త • ఖరకరుకరణిన్

చ॥ మఱియుబలాకికాచయసన • మన్వితమేఘము వ్రాలెఁబోల్చి తె
స్పఱితిగలాఁడు, రాఘవుమ • హోదరణోక్తులఁదేరి వేడ్కన

త్తఱేఁదనమంత్రిసత్తములు ♦ దాశరథుల్జరుదేఁగఁదోడన
న్నెఱిగలవీడుజేరఁజనె ♦ నెమ్మదిరోసముమోసులెత్తఁగన్ 35

వ॥ ఇట్లెల్లవారు గిష్కింధాపురవనమ్ముననున్నంత 36

సీ॥ లెస్సకుత్తుకఱేఁడు ♦ లెస్సగానత్రాత్రి,
నలుదిక్కులుక్కునఁ ♦ గలయఁగాంచి
ఝంఝానిలోపేత ♦ చండభాస్వన్నిల,
జలదగర్భాభగ ♦ ర్జలనునించి
బాలభాస్కరుభాతి ♦ భాసిల్లురాముని,
జూచికిష్కింధను ♦ సారిదిఁగాంచి
శ్రీరామచంద్ర! కి ♦ ష్కింధాపురికివచ్చి
నారమీవుప్రతిజ్ఞ ♦ సారెకెంచి
సఫలముంజేయనిద్దియె ♦ సమయమయ్యె
లతలకెల్లవసంతకా ♦ లమ్ములీల
చేరదీసిననన్నర ♦ క్షింపుమయ్య,
యన్నరాముండువల్కిన ♦ య్యర్కజునకు॥

క॥ ఎమ్మెగులుకసదగుకంఠమ్మునలక్ష్మణుఁడొసగిన ♦ నవసితగజపు
ష్పమ్ములమాకలిచేసిపిమ్మెయిబుఱుకయుతనూన్య ♦ నెనరకొండబత్తే

(రాముఁడింద్రజుందునుమాటుకై ప్రతిజ్ఞసల్పుట)

ఉ॥ నీరమణీయవక్షమున ♦ నిష్ఠురముష్టిచిమొత్తిబిట్టుని
ష్ఠూరపుబల్కువల్కుహరి ♦ సూనునిభానుజ! నీవ్రసూడనా
క్రూరపుటల్గుతోనతని ♦ గుండెలుబ్రద్దలుసేయకున్నవీఁ
డారఘురాముఁడా! దశర ♦ థాధిపుత్రుఁడ! నీకుమిత్రుఁడా 39

ఉ॥ నీరమణీమణింగొనివి ♦ నీతినిరాజ్యమువెళ్ళఁదోలివి
స్తారమదంబునంగడువె ♦ తన్నినుగుడ్పినజిష్ణుసూతినా
ఘోరరణావనిందగిలి ♦ కూల్పకమిన్నకయున్ననాఁడునీఁ
డారఘురాముఁడా! దశర ♦ థాధిపుబుత్రుఁడ! నీకుమిత్రుఁడా 40

ఉ॥ ఘోరతరంపుఁదాళ్ళనొక ♦ కోలనఁగూల్చినరీతిఁదైత్యశా
కీరముఁగాలఁజిమ్మినటు ♦ కెచ్చెలువానవనూలినాఁబ్లోఁ
గ్రూరపుభల్లముంబరపి ♦ కూల్పకమిన్నకయున్న నాఁడుపీఁ
డా! రఘురాముఁడా! దశర ♦ థాధిపుబుత్రుఁడ! నీకుమిత్రుఁడా 41

ఉ॥ ఓరుపుశాలివీవిటుల ♦ హా! మరపిల్లఁగఁజెల్లునాకఁ జుక్
నేరుపుశాలివాలిధర ♦ ణింబడఁగూల్చి నిన్నుదద్భపు
చీరథమంమఁగల్కిఁదరిఁ ♦ జేరిచియూరెలేగి నవున్న పీఁ
డా! రఘురాముఁడా! దశర ♦ థాధిపుబుత్రుఁడ! నీకుమిత్రుఁడా! 42

ఉ॥ ధీరతముండుకార్యములఁ ♦ దెల్లముగానెరవేర్పఁగాపనం
ధీరతనూనుమీవునుదృ ♦ తిన్విడనాడెఁగ వాఁడుగూలునా
శూరతమున్వధింతునిను ♦ జోటనిగూర్తటు నేయకున్న పీఁ
డా రఘురాముఁడా దశర ♦ థాధిపుబుత్రుఁడనీకుమిత్రుఁడా 43

క॥ ఈపగిదిఁబలుకు రామను, హీపలివాక్యములకలర ♦ ఋనతనయుఁడు తా
రాపతి పేరామరమున, కాపట్టునసింహనాదమ ♦ కైవెయొనర్చెన్ 44

ఉ॥ అండజరాజవాహతన ♦ యాండమునంతయుబిట్టగల్చుచూ
ర్తాండజసింహనాదమునఁ ♦ దద్వనచారిసమూహముల్గడుం
గుండెలుబ్రద్దలైచనెగ ♦ సుర్వొగువన్నొయిబోయ చేడియల్
పిండులుగాళ్ళుతొట్రువడ ♦ వెళ్ళిరిగీములు జేరఁగానడిన్ 45

తే॥ అఖిలభూతభయప్రదం ♦ బైనకర్మ
సాక్షిసుతుసింహనాదమ్ము ♦ శ్రవణగుహల
భిన్నములేయ వాలిదో ♦ ర్విక్రమంబు
భిన్నమైపోయెన్యగ్రోధము ♦ పెల్లురేగె 47

క॥ నవరోమపరీతాంగుం, డపుడునునెఱసంజకాంతి ♦ నలరెడుహరిజుం
డవునసగ్రగహణరవిగతి, నవతేజోహీనుఁడఁగుచు ♦ నవముగఁదోచెన్

ఉ॥ ఘోరతరంపుదద్రవము ♦ కుంఠితరీతిఁజెవింబడంగఁదా
(తారయుద్ధమున కేగవలదని భర్తకునుసెత్తిఁగఱపుట)
ధారమణంపుద్రుల్లిపడి ♦ రామలవీకిరదాళిదీటుచున్

జారుపదాబ్జఘట్టనర • సాస్థలిబ్రద్దలుగాఁగఁదమ్ముసైఁ
బోరుసకుగ్రభంగివడిఁబోవ • సుషేణతనూజయడ్డమై 49

క॥ కల్యమునఁదోచునుత్పల, కల్యాణింబోలె తార•కను వెతత్రోడన్
మాల్యముల వేణికుఱుచు, చహల్యాజారునికుమారు • నటుగని పలికెన్

ఉ॥ నాయక! వేగినంతటజ • నందగుఁజివ్వకుఁగాదయేనిమీ
జాయక ఖండదుఃఖములు • సారసమిత్రునికూర్మిపట్టిదా
జాయకపార సౌఖ్యములు • సంభవమానని నామనంబులో
బాయకత్రోచుఁచున్నదిభ • వద్ధృదయంబున నెంచుడీరలున్ 50

చ॥ అనికిపుడేగఁగానపజ • యంబొదవంగలదద్దియేమనన్
వినిచెద నాలకింపుఁడుర • విప్రియసూతిత్వదీయదోర్బలం
బునకునిలంగ లేకజని • మున్నటుఁదోర్బలమారనింతలో
న్ననమునగొంక కేసనుర • ణంబనిపిల్వగశంకపుట్టెడన్ 51

ఉ॥ అక్కపిముఖ్యుఁడిక్కరణి • నక్కడనుక్కున బెక్కుఅక్కటి
ట్లక్కఅనొక్కదిక్కఅయ • నక్కత మొక్కటిచిక్కునక్కటా
యెక్కడ నెక్కడిక్కరణి • నిక్కడయుక్కఆరెచ్చివచ్చునే
బెక్కురునుక్కడెక్కగల • బెగ్గడలండనువచ్చునచ్చున్ 52

ఉ॥ పుట్టువుతోన నేర్పుమెల • పుంబలుదెల్వియుఁగల్గియుండెనీ
యట్టిడు నెన్నియిక్కటుల • నాయసద్రోచిననీవునన్న నం
చెట్టుననంగఁజాలఁడున • హించెన దెంతయు నే నెఱుంగుదున్
గట్టిగదొడ్డయండగని • కానియతండని కేగుదేరఁడా 53

సీ॥ ప్రాణేశతచ్చరి • త్రంబెల్లవినియుంట నంగదువలన • నేననదదంట
యై తిరుగఁగనర • ణ్యమున నాతనికంట వేగరుల్ బ్రీతిమై•వినిచిరంట
శ్రీమదయోధ్యాపు • రీపతిసుతులంట దాయలకేరిక • జేయులంట
లలిరామలక్ష్మణా • ఖ్యలఁగ్రాలువారంట వడినక్కకూతగా•వచ్చుగంట
వారిలోరాముఁడనువాఁడు • బలియుఁడంట
మార్తురనునాథునుఁజుమచ్చు • మాపునంట

కరుణనెట్టిరుణరణమ్ము • గాచునంట
ధరణిశివాళికిని జేరు • దారకరంట 54

క॥ సాధుజనకల్పవృక్షమ, సాధుజనత్రాణభయము • సమ్యక్కరుణా
సాధోధి కీర్తినిర్జిత, సాధోధవిధీంద్రసేవ్య • పాత్రమునాధా! 55

తే॥ కన్నతనిమాట జెల్లింప • గానకేఁగు
తమ్ముఁగుఱ్ఱఁడు కూర్మిపెంప • దేకమ్ముగాఁడ
రావనమ్మున కేతెంచె • రమణి గొన్న
పుణ్యజనభర్త వెడకుట • పొందె నటుకు॥ 56

సీ॥ అరుదెంచెనత్యుగ్ర • కర తేజుఁడమితబ
లాఢ్యుండు పాతకచమూ • హరుఁడు శతులుఁ
దేరఘురాముతో • వైరంబు బూనుట
గోటియగోత్రమ్ముఁ • దాఁకొన్నయటులు
హరిణపోతమ్ము సిం • హమ్ముఁ దాఁకిన జోక
గరుడిబిఁ జక్కఁదాఁ • కఁ గడగినటుల
నిన్నెత్తిపోడచితి • నేనసంతాపకు
ప్రాణేశ! నీపైని • బాకినటులు
బలుకుచుంటిని గినలున • బలుక బోకుఁ
డెలమి నాపల్కు లిమ్ముగా • జలుపమీకు
జయముగాంచను సుప్రెడ్లఁ • శ్రద్ధతోడ
నాత్మరిపుల గెల్చిన నా • కరులకడ॥ 57

ఉ॥ నేరము సుమ్మి యాజిధర • ణీవరచంద్రుని నుగ్రసూనుతో
వైరము నైసనే నొకయు • పాయము జెప్పెద రాముడద్భుతం
దారము గాన గోరుశర • ణమ్ము పదంపడి యూనరాజ్యమిం
పారముదమ్ముతో నొసగు • స్వానుజుఁ బిల్చి యడంపు కోపము ॥ 58

చ॥ మనవి యొనర్తు నే నొకటి • మంచియొ చెడ్డయొ నాకుఁదోచున
ట్లనఘచరిత్ర! మీమదికి • నయ్యది లెస్సగనున్న జేయనౌ

జనకసుతామనోహరుని ♦ సఖ్యముఁ గోరుదుగాని వైరమున్
మనమునఁ గోరఁబోకుమది ♦ మానుము మానుము మాను మెప్పుడున్ ॥

శా॥ తమ్ముం డొక్కఁడ కాఁడ నీకు మహితో ♦ దారుం డతం డెన్న నీ
తమ్ముం డొక్కఁడ కాఁడ నీవయిపు బాం ♦ ధవ్యంబు నీ బందునీ
తమ్ముం బోలిన వానిఁ జూపఁ తేఁడు నీ ♦ దాయానకై నీదుర
క్తమ్ముం బంచికొనేకదా జననమం ♦ దంగ్గైనీతోడుతన్ ॥ 60

శా॥ నీమేల్ గోరెడుదాన నేననిమదిన్ ♦ నీకుందు నేన్నావయిం
దామే నాఁడఘుమెన్న లేని మఱిమ ♦ ద్వాక్యమ్ము మీకిష్టమేన్
స్వామీ! తమ్మునిపట్లఁ ద్రోహపుఱెడం ♦ దస్మాను మన్నన్న! నీ
వేమా తమ్మునిఁ జల్కఁ జూడ నెరుమా ♦ జేలా ప్రశంసింపఁగన్ ॥ 61

చ॥ మఱియు దినేశ ఘృష్టితతి ♦ మ్రగ్గెడు చెందొవకల్కిఁ పోల్కిఁ నీ
మఱదలు నీదు గేహమున ♦ మాటికిఁ బెన్మిటి లోఁదలంపుచుం
వఱలఁగఁ జూడఁ బాడియ ల ♦ వమ్ము కృపామతి లేదె నీకు న
త్తెఱవను జూచియైన గృప ♦ దేర్పుము తమ్ముని మాన్పు వైరమున్ ॥ 62

క॥ కరమున గరమునుపుము నృప
వరసుతుతో వైరమూన ♦ నామాయని మ
చ్చరముడుగు వినుము నిర్జర
వరసుత! నామాట చనఁగ ♦ వలదిపుడనికిన్ ॥ 63

క॥ కలకంఠి తనదుహితమిటు వలుకఁగఁ బెడ చెవిని బెట్టి ♦ వాలి వినఁడహా!
నలువలిఖిత మెటు దప్పను సిలఁగూలఁగనున్న వాఁడు ♦ హిత మేలవినున్

క॥ తారనఖకాంతినిర్జిత తారసురూపజితధిషణ ♦ దార సుమేధా
దారనిజదారబల్కఁగ తారధరాత్మజుఁడు బదరి ♦ తాఁగినుకననున్ ॥ 65

భార్యమాటలు పెడచెవిం బెట్టి వాలి యుద్ధమున కేగుట.

మ॥ అబలారత్నమ! యిట్లులాడఁదగవో ♦ నా! సోదరుండాయతం
డు ఖలా! యేమన బ్రహ్మ వ్రాత యనికిం ♦ దోశ్శాలియై వాఁడు బి
ల్వఁబలార్యంశజుఁ డోర్వఁగావలయుఁగా ♦ వైరంబు వ్రానాడి యె
న్నఁబలాఢ్యుండగు శూరపుంగవునకు ♦ ప్రాణంబు పైతీపోకో? 66

క॥ కైదువు నురువని వానికి నైదుపదియొనర్పజాల♦నట్టిడికి సఖీ!
వేదికరిపరిభవం బెద నేదికడకునోర్చు కంటె♦మృతిమేల్ హాహా॥ 67

క॥ త్రాణఁగలాఁడటవాఁడని జాణయటదురానకంట♦చైపిచెనటే
త్రాణఁగలాఁడంగానట ప్రాణమునకునోడి యోర్చు♦వలెనట కంటే॥68

క॥ తనకపకారము జేయని మనకపకారంబు గామ♦మహిఁపుఁడు సేయం
దనకమరు నెద్ది కామిని! మనకతఁడటుజలుపఁడనుము♦మహితుండవుటన్

సీ॥ లావణ్యవతి! నీవు♦లలనామణులునంతి
పురమునకరుగుఁడు♦పొందునీకు
నాయెడఁగలభక్తి నాకు♦చెప్పితివింత
వట్టుసేనెఱుఁగుము♦నెట్టులైన
నని కేగినీ దేవ♦హనిభుజగర్వంబ
డంచినచ్చేదజంప♦నెంచనమ్మ
హీనుగర్జలవిని♦యేసహింపఁగఁజాల
నేగుముమజ్జయుం♦బెదనుగోరి
ప్రాణములనొట్టుబెట్టెద♦భామ! యన్న
ఘనమనోవ్యథనాదని♦గాఁగిలించి
ప్రీతిని ప్రదక్షిణించియా♦ర్తనివెలంది
కోమెఁగాంతలుదానంతి♦పురముఁజేర॥ 70

వ॥ ఇట్లు య్యిందిందిరాలక సుంపానంగంధి యీారెలుంగున విలపించుచుం
జనినంత హరివిభుండక్త్యంత దురాగ్రహంబునం బురంబు నిర్గమించి.

సీ॥ ప్రళయోగ్రరోషసం♦కలితుఁడై నిష్టూర్ఘ్న
విషుచుచుశాత్రవ♦వీక్షణేచ్ఛ
నలుదెసల్ పరికించి♦తిలకించె గాంతిని
ర్జతభానుడైనను♦గ్రీవునిచ్చ
తిలకించిపైఁజేలఁ♦దిట్టమ్ముగాఁజుట్టి
మొలభుజాస్ఫాలన♦మ్ముంబొనర్చి

ముష్టిపై కెత్తిలో • మొటమరించినగిన్క-
బిర తేరనవ్వాలి • పైకెదిర్చి
యదరు బెదరు లేక • యంశుమాలితనూజుఁ
డన్న పోల్కి-వచ్చె • నరుదుగాఁగ
దనకు నెదురువచ్చు • తమ్మునిగన్గొని
యాగ్రహమ్ముతేగి • యైంద్రిన ల్కె-॥ 72

వాలిసుగ్రీవులొండొరుల నధిక్షేపించుట

ఉ॥ ఇంతకుమున్నె నీపడిన • యెక్కు-డుబన్నముఁదల్పకిట్లునా
చెంతకువచ్చి తేమని యె • సిగ్గొకయింతయు లేకపల్కు-రో
హంతకుఁడా! శతారమును • హాసము సేయు మదీయముష్టిని
న్నంతకు జేర్చుజుమ్మిపుడ • హంకృతిబోవిడిరమ్మునావుడున్। 73

మ॥ పిడుగుంబోలినవాదముష్టియునిదే • భిన్నంబుఁగావించుని
న్నడుగుందాటగనీమకోఁ! మహితా • హంకారవాక్యమ్ములీ
వుడుగుద్రేకముగాగ ప్రోగిననునీ • యుద్రేకమేనార్తుఁజూ
చెడుగుంబల్కు-లతో ప్రయోజనముని • సీ! లేదుపో దుర్మతీ॥ 74

వాలిసుగ్రీవుల సమర ప్రారంభము.

ఉ॥ అంతటనక్రుధన్ వారిహ • యాత్మజుఁడట్టెన్వముష్టిఁగొట్ట మే
నంతటనల్లబెల్లురల • నర్కు-సుతుండొక శాఖిశాఖతో
జెంతలజూపగుల్ వెగటు • జెందగదిర్ద్రిరద్రిప్పికొట్టె మే
నంతలతాఁచిలెన్వడక • నైంద్రిభయంబునఁ దద్దగిల్లగన్॥ 75

మహాస్రగ్ధర, రవిజోర్వీరుడథిన్ని • ర్జరపతిసుతుఁడా • రంభమందట్టిభీతిం
దవిలెం తేసంచలించె • ధరణిప్రళయవా • తాహతిందూలులీలం
సవికల్పాత్ముంమన య్యెం • జగతినడుగులా • సాగకేపోయెనహ్వా!
రవివొంగం బెపయిన్ని • ర్జరపతియునభై • ర్యంబుజెందంగలోనన్

సుగంధి. వాయువైన తేయవేగ • వంతులుం బహిప్రభా
కాయులుం బలాఢ్యులైన • కంథరాశ్వభానుజుల్

జేయుచుండి యుద్ధమట్టె • జేరిదోర్యపథమ్మునం
జాయరేయి రాయలట్లు • జాలఁగ్రాలిరెంతయేఁ॥ 77
తోటకము॥ వరదోర్బలముంగనుట • వాలికిబం
ధురసత్వముహెచ్చెను• దొండరతోఁ
సరసీరుహబంధుజు • సత్వముస
త్వరతందిటవ్రుం • జెడి తగ్గిచనెఁ॥ 78
పంచచామరము॥ బలారిసూనుముష్టిఘాత • భగ్నదర్పుడయ్యుఁబ్రో
జ్వలాంగముఁదు రోషమట్టె • వర్ధిలంగ రేగిత
ద్బలారి జోర్చియర్కిలాఘు • వంబుబాహుసత్వముం
గలాడటంచు జూపరెన్నఁ • గాదురంబుఁజల్పెనా॥ 79
క॥ ఇతరేతరజయకాంక్షల మతకరులందీటిహరుల • మాద్రిగవారల్
వితతమ్ముగఁబోరిరిముష్టితతుల బాహువులనుతనుప•టిమ మెఱయంగాఁ॥
చ॥ ఇరువురు నొక్కరొక్కరి మ • హీస్థలి నీస్తురు నీడ్చ్రిత్రొక్కనెం
త్రిరువురు బాదఘట్టనమ • హీస్థలి గ్రుంగఁగదాతు రుక్కమై
నిరువురుముష్టి మొత్తుదు ర• హీనజనమ్మునఁదాకుచుందు ర
య్యిరువురకిట్లుసాగె నమ • రేశ్వరవృత్రులపోల్కియుద్ధమా॥ 81
వ॥ అంత నవ్వాలి ముష్టిఘాతంబుల 82
క॥ పులిపులియైమైదురమున బొలబొలరారోమకూప • ములరక్తము న
వ్వాల వలనఁజిరవితనయుఁడు దెల తెలవ్రాపు చెదజంకి• దెసలంగాంచెఁ

(రాముఁడు వాలిందునుమాడుట)

చ॥ అపుడు కృపాపయోధి శర • శార్ఙ్గి జనావనదీక్షుఁడర్కవం
శపుఁడు నికృత్తదైత్యుఁడు క్ష • మాతనయాప్తుడు సత్యసంధుఁడు
ద్విపుఁడు శ్రితాదరుండు రఘు • వీరుఁడు నర్కజుపాటుగాంచి తా
నపుడు హరిక్షపాకరున • కన్న ప్రతిజ్ఞనుదీర్ప నెంచిలోఁ॥ 84
వ॥ వాసవనందనుఁడుమున్ను ముక్కంటివలనం బడసిన వరమ్ముందలంచి
శా॥ వేలీలంజని వృక్షమూలమున దీ • విస్మేరగాఁబొంచి ప్ర
త్యాలీఢుండయి క్రూరనారసము కం • డమ్ముల్ పొదిందూసి ధా

న్కై లీలందగువింటగూర్చి గుణమా • కర్ణాంతముల్ లాగి దృ
గ్లీలక్ష్యంబరిబోరనిల్పి చదిపెం • ధీశాలి వాలిం లలిన్॥ 86
శా॥ వక్షోభాగమునందు గ్రూరశరము • న్వ్రేళంబున్నై నాటరా
మక్షోణీశుఁడు వజ్రివజ్రమునగూల్ • ప్మాధేంద్రుఁడోనాగ యు
ద్ధక్షోణింబడె వాసవాత్మజుఁడు స • త్వంబంత ముల్ దగ్గిపో
రక్షోవైరిపుడార్తిబుంగ నెదమా • ర్తాండుండు నుబ్బంగనన్॥ 87
క॥ ఈలీలవాలివ్రాలిన నోలినెఱిందొఱగె నేల • యొక్కటనహహా!
గ్లాలేనిబయలుపోలికవ్రాలియునురువిడఁడుడాల్ దో•అంగడతండ్రుల్
మ॥ మఱియుండంబ్రడిడినట్టి భర్మమణిదా • మ శ్రేష్టసంపన్నతన్
నెఱిదేజంబుబరాక్రమంబు నొకయిం • తేనొరంగంను నా
నెఱి దండన్మెడదాల్చి సంజతఱిగాల్ • నీలాంబుదంబుంబలెన్
మఱిగ్రాలెన్ దెరగంటిరాకొడుకు శుంభ • ద్రాజబింబాననా! 89
క॥ మువ్వన్నెమెకముపోలికమువ్వన్నెలవెలిగెవాలి•బొన్నసరముతో
నవ్విమలతనుద్యుతితో నొవ్వంజేసిన తనుద్ధ్య • నుతభల్లముతోన్॥
ఆ॥ సింహికాత్మజుండు•జిక్కబట్టివిడంగఁ గాంతిదొరగియున్న•కర్మసాక్షి
వోలె దవ్వథింప•జాలరిగననున్న వాలిజేరనృపుఁడు•వచ్చెనపుడు॥ 91
క॥ తనుడాసినగుణరాశిని ఘను రాము సుమిత్రసూనుఁ•గనులారంగాఁ
గనుగొనిమృదువునుధర్మంబునుకటువునుగాగ శక్ర•పుత్రుడువలికెన్

(వాలి తన్నుదునుమాడిన రాముందూఱుట)

శా॥ రామా రాజలలామ! నీవఖిల ధ • ర్మజ్ఞుండవంచుం బుధ
స్తోమారాధిత విగ్రహుండవనుచుం • దోశ్శాలివంచెన్న సు
త్రామాదుల్ వినియుంటి నట్టిడవు నా • తమ్ముండునేఁబోరఁగా
నేమార్గోమ్మునునుండ జెండితివి న • న్నే ధర్మమం చెన్ని యో॥ 93
ఉ॥ నీమొగమేను నామొగము • నీవునెఱుంగము నెన్నడుంగటా!
రామొకనాఁడుపోరికప • రాధము లెవ్వియు జేయలేదు శా
ఖామృగరాజునేనట జ • గత్పతివీవట రామరామా! ని
న్నేమనువాఢ నన్నుబడ • నేసితివింముసురేను ాసితిన్ 94

క॥ మాయకుఁడవంచెఱుఁగ న
మాయకుఁడవటంచు దలచి మాయురె! యనికిం
డాయఁగులకాంతవద్ద న
మాయంగననయ్యెఁ గీర్తి ♦ మాయంగనయెన్॥ 95

తే॥ తృణపరిచ్ఛిన్నకూపసం ♦ దీప్తమగుచుఁ
గపటమునివేషధారి వై ♦ క్రాలు నీవు
వర్తనమెఱుఁగకే నిట ♦ వచ్చినాడ
సార్గినడికాన నీచేతఁ ♦ జచ్చినాడ॥ 96

సీ॥ ఎల్లగుణమ్ముల ♦ ల్లితంపేనన్న
పెక్కురు పల్కులు ♦ మొక్కవ్రాయె
నెల్లధర్మమ్ముల ♦ నెఱిఁగినవాఁడన్న
పురుషవర్యులనుడి ♦ పొల్లువ్రాయె
నెల్లసమరధర్మ ♦ మెఱిఁగినబలియన్న
ప్రాజ్ఞులమాటలే ♦ వట్టివాయె
నెల్లభూతమ్ముల ♦ నెక్కటేఁగనునన్న
సజ్జనవాక్యమ్ము ♦ సన్ననాయె
తే॥ పోరువెట్టుట యాహవ ♦ భూమిఁజొరుట
నగముచాటునఁ బొంచుట ♦ ననుఁదునుముట
నిట్టిదుర్యశమెట్టులు ♦ నెట్టిబయట
తిరిగెదవొ నీవు శ్రీరామ ♦ తెలుపురనట॥ 97

క॥ భూరమణఘ్నుఁడు గోఘ్నుఁడు
చోరుఁడు నాస్తికుఁడు విప్ర ♦ సూదనుఁడు సతీ
దారుఁడు నగ్రజునివ్వాడి
దారంగొనువాఁడు స్వగురు ♦ తల్పుఁడు మఱియున్॥ 98

తే॥ ప్రాణిహింసాపరుండు మి ♦ త్రహారణుండు
సూచకుండాదిగాగల్గు ♦ నీచులెల్ల
రౌరవము మొదలైన నా ♦ రకములందు

మఱుఁగుదూరు నీదుకొంపయు ♦ మఱుఁగునే మొ॥ 99

తే॥ వద్దుసూ!యన్నపనిసేయ ♦ వద్దనిరిల
పెద్దలెల్లరు నమ్మాట ♦ వృథయెఔను
ఔర సర్వజ్ఞ నిజదార ♦ తారమాట
లాలకింపకపోతినే ♦ చణఁగిపోతి॥ 100

క॥ కానిబుధవర్యులిహహి మానిసిబువ్వ తెగఁజేఁడు♦మఱిసేయవలెం
గానిధరణీశుఁడొనరుప గానిటుఁతగదనఁగ నెట్లు♦గామహిమ నెదో॥ 101

క॥ వైరినిబలవంతుడఁనని బారినిబడిపోరితేని ♦ వరత్రుటిలోనఁ
సోరిని జూపన మాయలమారీ! నిన్నతఁడుసాల♦మన్ననసేయఁ॥ 192

క॥ సుగ్రీవుఁడేల యల్లదశగ్రీవుని వానిపురము ♦ జానకి నీపా
దాగ్రములదెచ్చిడనె కంబుగ్రీవా! నాకొకింత♦ మున్న తెలిపితేఁ॥

వ॥ ఇట్లు విగతతేజుండై శరహతి జ్వరపీడితుండై నొరెండివాలియూర
కున్నంత. 104

(రాముఁడు వాలింజంపుటకుఁ గారణమతనికిం దెల్పుట)

క॥ తతధర్మార్థోపేతము హితవుంగటువునగుపల్కు♦లిట్టులుపురుహూ
తతనయుఁడువల్కుదను సంతతమూరకచూచుచున్న♦దతమన్యువుఁతోఁ

ఉ॥ కాంతిదొఱంగియున్న దిన ♦ కాంతునిపోలిక యుద్ధధారుణీ
కాంతను గౌగిలించి వెత ♦ గ్రాగెడివాలికి బల్కుధారుణీ
కాంతుఁడు ధర్మసంయుతము ♦ గాఁగపినాథ! బుధాళిసేవ నీ
వింతయు జల్పమింబలికి ♦ తీవహి వానరచాపలంబునఁ॥ 106

సీ॥ వనములు ఫలపుష్ప ♦ వనములు విమలజీ
వనము లియ్యలయుని ♦ త్స్వాకులడియ
నగముల ఖగముల ♦ మృగములనలవారి
కరుణఁబెంపఁగ ద్రుంపఁగ ర్తలరయ
ధర్మగుణశీల ♦ ధర్మగుణశీల
నిజమఱియైకడు ♦ నేర్పుమెఱయ
భరతుండు పుణ్యాలా ♦ భరతుండు సర్వస

ర్వంసహా సేలు సూ ♦ త్రాణవెలయ
తమ్ము జేసుదదాజ్ఞ స్వ ♦ ధర్మవిజయ
సిద్ధికై వచ్చినారము ♦ సిద్ధమిదియ
శిష్టరక్షణముం దుష్ట ♦ శిక్షణమయ
భంగిలీలల జలుపఁగా ♦ వలయునయ్య॥ 107

ఉ॥ ఈవనగామతంత్రమునె ♦ యెంతయు ముఖ్యముగా దలంపుచుం
బావనమైన ధర్మముఁ గ్ర ♦ మంబుగఁ బోకడఁ బెట్టి దుష్టసం
భావనమైన త్రోవ నస ♦ మానముఁగాఁ జరియింపుచుండి నీ
భావన సేయ కే పరుల ♦ బల్మరు దూరఁగ నేల గర్వివై॥ 108

చ॥ వనచరవర్య! ధర్మపథ ♦ వర్తులకుం జనకుండు నగ్రజుం
డును గురువర్యుఁడుం నెఱేఁ గ ♦ నుంగొనదండ్రులుజుమ్మి సోదరుం
డును బ్రియశిష్యుఁడుం దనయుఁ ♦ డుం దనపుత్రుని యట్టివారలీ
ఘనతరధర్మముం దెలియఁ ♦ గాఁదరమాదరమంబు ముఖ్యమా॥ 109

మ॥ వినుమా నిందునుమాదుకారణమునే ♦ విన్పింతు నీవుంగనుం
గొనుమా లోపలిచూపుతో ననుజన ♦ న్నుం బెండ్లముం గోడలం
చనుమానింపకఁ జెట్టబట్టితివి కా ♦ మాంధుండవై యట్టినిం
దునుమాడందురితంబదెట్లొ కలగుం ♦ డుం జెందకంబల్కుమా॥ 110

క॥ తనతనయతో ననుజతో దనతమ్మునిభార్యతోడ ♦ దారక్రియచే
తనతలపక దిరిగిన జింతనఁదగసల్పకయదునుముఁ ♦ దగు నెవ్వని నేఁ॥ 111

సీ॥ త్వత్పాలితములైన ♦ వనములై ఋష్యాకుల
వైననవన్నిమా ♦ వౌనకాద
కుజనసంహారణంబు ♦ సుజనసంభరణంబు
ఱేనికి సహజంబు ♦ లౌనకాద
పైడలిగొనితమ్ముఁ ♦ బైగుడ్డతో వెళ్ల
నడచినయది నిజం ♦ బౌనకాద
తనతమ్మునిల్లాలిఁ ♦ దవిలినవానిశా
సింపనౌనని మునుల్ ♦ చెప్పలేద

చెలిమి సీతమ్మతో నేను ♦ చేయలేద
చంపుదును నిన్ను నిప్రతిజ్ఞ ♦ సల్పలేద
యాడితప్పినబిట్టు త ♦ ప్పౌనకాద
యరసియిందొక తప్పున్న ♦ నాడరాద॥ 112

శా॥ పాపంబేపున జేసి మానవులు భూ ♦ పశ్రేణిచే దెల్లి త
త్పాపంబెల్లనడంగ స్వర్గపదవిం ♦ దా మొందుదుర్ పుణ్యుల
ట్లేపట్లన్ నృపుచేత జోరుడు నటుల్ ♦ హింసన్వానం జెందిమున్
బాపంబంతయుబీడు ♦ బుణ్యముతనుంబ్రాపింపఁగా నేమొకో॥ 113

ఉ॥ దోషము సేసినట్టిరిని దున్మకమిన్నకయున్న జేని ద
ద్దోషము జెందుజుమ్మ నటు ♦ దోషులదున్మరె మున్ను జేంఘ్లు ద
ద్దోషములందొ అంగ నల ♦ ద్యోపురిజేరరె వారలెల్ల నీ
దోషము నెంచినే నిపుడు దు ♦ న్మితి దప్పెదియో వచింపుమా॥

క॥ మాతాతయైనయలమాం ధాతయతియొకండుదనదు♦ధర్మమువిడఁగా
నోతారాధిప! యాతని యాతతగర్వంబడంప♦డా! యతు లెన్నన్॥

తోటకము॥ ఇదియిట్టులుగావున ♦ నేలికనే
ఇది యేమనరాదు సు ♦ మీ! మఱియుం
బదరందగదింతయు ♦ మానసమం
దుఁదగం దెలియందగు ♦ దుష్టులిలన్॥ 116

క॥ సాధుజనావనమునకు నసాధుజనహరణమునకు ని ♦ జంబుగఁదారా
నాథ! తిరుగుదురు నిర్జరు లీధరణినిమర్త్యతన్య♦ధేచ్ఛాగతులై॥ 117

క॥ ఈపగిది రామచంద్రుడు తేపకుదనుమందలింప♦దెలిసియపుడు దా
రాపతిగుందుచుబశ్చాత్తాపము జెందె నృపవర్యుఁ♦దాబదరుటకై॥

ఉత్సాహ॥ నేలఱేఁడ! నీదుపల్కు ♦ నిజము వే యి కేల నిం
జాలదూలనాడినాడ ♦ సాధ్యమానవన్ను బోల్
కూళమిమ్ముబోలు ఘనుల ♦ గుణము లెఱుగ నీకిదే
కేలుమోడ్చిమ్రొక్కువాడ ♦ కృపదలిర్పఁగావుమీ॥ 119

శా॥ దేవా! నీవొకమర్త్యమాత్రుఁడవె య ♦ ర్థింద్రైవతశ్రేఖులం

గావంగా నిలమర్త్యరూపమునఁ గ్రాల్ కం◆జాయతాక్షుండవం
చేవం గల్గఁగ జేసె నాయనములో◆ నీరల్ వితంబారయన్
నీవాక్యార్థములట్లు దోఁచెను నిదే◆ నిక్కంబటంచెన్నెదన్। 120

క॥ పాపమతి జేసినాఁడం బాపములెన్నేనివాని◆ బాటింపక నా
పాపములడఁపుము ఖండితపాప! ముదంబున ననన్ను◆ బాలింపఁగదే॥ 121

ఉ॥ అంగదఁ జెంద నాత్మసతి◆కై కనకాంగద తారహారకై
యంగదఁ జెంద నాపఁడట◆కై హితబాంధవమంత్రిపాళికై
యంగదఁ జెంద, నాదయిన◆యంగము పేరిటి ముద్దుపట్టికై
యంగదఁ జెందువాఁడ పసు◆ధాధిపనందన మాటిమాటికిన్ 122

క॥ వగవగ, వగవగ నెట్టులొ, మగమొలకయు లేక లేక◆ మాకుదయించెం
దగ జేత బెంచుకొంటిమి వగతున్నా పాటువిన్న◆ వగచునటంచున్

క॥ ఇంతప్పుడెత్తుమఱిగిన నంతప్పటిదనుక బ్రేమ◆ నతని బెనుపఁగా
నంతపుషు బొత్తుమఱిగె, సికెంతప్పటికైన విడఁడ◆దే చనవుమెయిన్

శా॥ తాకుందప్పెరుగండు, ముందువెనుకా◆ధారంబులా లేవు, దా
నాకుం గూడుపనెంచుమాలిమిని నె◆న్నంజిన్ని పాపండు దం
డ్రీకుందుంగనునంచు దల్లడిలెదేన్◆ బ్రేమంగనుంగొమ్మమున్
మీకుం గూర్చుచు దల్లిదండ్రులిక నైపై◆మీరేసుమీ వానికిన్ 125

క॥ ఉంచుము కృప, నెఱిజూనుకలనించుము పైరవిజునట్లు◆ నీదయనీళ్లన్
ముంచుము పాలనుముంచుము, పంచుముదంబుననసీ◆దుపనులగృపాబ్ధీ

క॥ నీతమ్ములగనినట్టుల నాతమ్మునినంగదుని ఘృ◆ణామతిగనుఁడీ
నీతమ్ముగదార యెడల నాతమ్ముఁడు మెలగునట్టు◆ నయవరగనుమా

క॥ అడ్డమువచ్చి నెలంతుక గడ్డముపట్టి బ్రతిమాల◆ గా వినకీటు రా
బడ్డకతమ్మున నీగతి జడ్డన ప్రాప్తించె రామ◆చంద్రా! కంటే 128

వ. అనిపలికి పౌరందరి పునఃపునరభివందనంబులం జలిపియూరకున్నంత

క॥ శ్రీరఘురాముండిట్లను బౌరందరి! మదినడలకు◆బదిలపరపుహృ
త్సారసము నీవు వెనర్చిన నీరసపుఁబనికి చికిత్స◆ నేజల్పితిఁబో. 130

క॥ నీకొమరుఁడఁ బలుడనియున్న నీకొమగోలయని◆మదిని◆నీవడలకు ఖా

నాకొలదివారినరయుదు నీకొలదూలెనికయేల నీవెదవగవన్ 131

క॥ అనవిని వాలియు రామా! ఘనశరపీడితుఁడనగుచుఁ ♦ గాఱులఁ జిత్తిన్
మనమున నుంపకనయ్యా! ననుగావుము కరుణమెఱయ ♦ నాకేశబలా!

తే॥ అంతవానరనాథుండు నాశు ♦ గపరిపీడితాఖండ వేదనాన్వితుఁడగుచుఁ
గంటకప్రస్తరావృత ♦ కదనధాత్రిఁబడిపొరలుచుండె వాయొండి బాధచేత

తారా విలాపము.

సీ॥ ఆపైని రఘురాముఁ డాశుగహతినిజ వల్లభుండగు వాలివడుట దెలిసి
ఘోరదుస్సహదుఃఖభారయై తార సపుత్రయై వానరుల్ మూఁగిబలసి
వెంటరాకిష్కింధ వెడలె నంతే వేగమున నంతగపియూథపులును జడిసి
కార్ముకహస్తుని కౌసలేయుని రాముదిలకించి నాలుగుదెసలుసరసి
గీ॥ సింగమునుగాంచి భీతిచే జెదరిపాఱు
మృగములనుబోలెపాఱగా మెలతమిన్న
గాంచియిట్లనిపల్కునో కపికులేంద్రు
లార! నావాక్యములువిని నాకెయనుచు. 134

ఉ॥ మొన్నటిదన్కవేల్పుదొర ముద్దులపట్టినిగూర్మిగొల్చి మీ
రున్నతిదక్కి శైలగుహలొక్కటజొచ్చగ బాడియా? నొకో
చెన్నటి భానునందనుడు ♦ జేరెను నన్నను రాజ్యకాంక్షమై
నన్నతివం దొలంగి చన ♦ నాయమ నాయనలార! మీకిటన్. 135

చ॥ అన విని వారలిట్లనిరి ♦ యామెకు యుక్తిగ జీవపుత్ర! నీ
తనయుని గాచికొమ్మతడ ♦ తారకమాచుమినీకుముందు; నీ
ఘనతరయుద్ధధాత్రిజనఁ ♦ గాఁ దగ దేగుము రాజధానికిన్
వనచరరాజుగూల్చెరఘు ♦ వల్లభుఁడల్లదెక్రాల్ యమ్ముఁబలెన్ ॥ 136

సీ॥ బృందారకేంద్రుండు ♦ వృత్రాసురునిగూల్చు
వడువున రాముండు ♦ వాలిఁగూల్చె
వాలిపాటునుగాంచి ♦ వానరులెల్లరు
కాలికొద్దినడచి ♦
రవధానమునదిర్గ ♦ మంగదురాజ్యంబు

నంమునిల్పవ్వాల • నతనిగొల్చి
నిల్తురేవానరుల్ • నీవువేగమచని
గవకులకావిడు • కడిమిబొల్చి
యిందునిల్వంగఁగూడ దీ • వెంములకన
శక్రసుతుఁడున్ననట్టిరు • శౌర్యకలన
బురము జొరిరేని యూరక • పోరు లలన
లందఱం బాధపెటుదుర్లో • యబ్జవదన! 137

శా॥ ఆమాటల్ విని తారవల్కుఁబతి దుః • ఖాయాసమగ్నాత్మయై
ద్యోమాణిక్యరుచిప్రకాశుఁడు కపీం • ద్రుం డాదితేయాధిప
శ్రీమాణిక్యమ యానసంబుననదే • ర్మిన్నెక్కె నర్హుండు, సం
త్రామాపత్యమె పోవనేల పెర • వారల్ నాధునేజేరెదన్॥ 138

మ॥ అనిదుఃఖింపుచు అమ్మనెమ్మొగమునన్ •హస్తద్వయిన్మోదుకొం
చనివార్యంబగుప్రేమహా! కపివరా!హా!• హృద్వరా!యంచు ధై
ర్య నిలింపాద్రిని శాస్త్రవేదిని;నవా • ర్యప్రాభవౌదార్యు,వా
లిని నంతంతటగాంచి తల్లడిలి వె • ళ్లెన్ దగ్గరంజేరఁగన్॥ 139

మ॥ ధృతిపై మాంసముఁబొంటె కేసరియు మ • ర్దింపంగగూల్ దంతియు
న్నతి యుద్ధావని ధూళిబ్రుంగిన మె • యిన్బాణాగ్నిచేఁగ్రాగు ద
న్పతి బాణాసనబాణహస్తుల ధరా • పాలావతంసంబులం
బ్రతిభావంతుల రామలక్ష్మణులన • మ్మార్తాండజుంగన్గొనెన్॥ 140

ఉ॥ వారినతిక్రమించి నిజ • వల్లభుపాదతలమ్ముజేరి గ్రై
జారినపైటచేతముఖ • చంద్రునిగప్పిడి పట్టువీడి తా
జారిన కీలుబొమ్మగతి • సాశ్రువిలోచనయై ధరంబడెం
జారినభ్రాతృపత్ని సుతుఁ • జయ్యనఁగన్గొని కుందనర్కయున్॥141

అలసగతి॥ నెలతయిట్లువ్రాలి కడు • నిద్దురను నెంతేఁ
దెలిసినటులేచి స్వప • తిన్ బ్రియతనూజుం
బలిమినిగవుంగిటను • బట్టి విభుమైపై
నలసగతి దుఃఖమున • హా! యనుచువ్రాలెన్॥ 142

ఉత్సాహ॥ ఆహవంబులందునెట్టి • రైన లెక్కసేయ కే
బాహుశక్తిఁ బోరి వారిఁ • బట్టికూల్పఁ జాలు నీ
వాహవంబునంబడంగ • నగఁడుదోఁచె నామహో
త్సాహముడిగెనింక నేమి • సల్పుదాన నింద్రజా! 143

సుగంధి॥ ఎన్నఁడైన నీదుమాట • కే నెదిర్చియుండ నీ
కన్నబిడ్డయట్టిదేము • గష్టమోర్చి పిల్వఁగా
మిన్నకుంట బాడియౌన • మేదినీశ! నీకు న
న్నన్న? చెమ్మలేసుగంధి • లాంబువాయనా? కటా! 144

జలధరము॥ ఇమ్మహిందొర్లు చేడ్వ గన • కేనను నీ
రమ్ములతియున్న బెంజలధ • రమ్మటుగ్రా
ల్చిమహిం గాఁగిలిన్వదల • వీల్గియు నీ
వమ్మకచెల్ల! యొంతప్రియ • మామెపయిఁక॥ 145

సీ॥ అడఁగెనా నేటితో • హరినాథ! నీతోడ
వసులగ్రీడించెడు • వైభవంబు
మడఁగెనా నేటితో • మన్నాథ! నీతోడ
మంజురీతింబల్కు • మధురిమంబు
తొలఁగెనా నేటితోఁ • దులలేని నీరూపు
భంగి నెన్నఁగల నే • ర్పరితనంబు
మలఁగెనా నేటితో • మత్తరుణులు రేపు
మాపునన్మన్నించు • మానితంబు
నెల్లసవతాండ్రలోన నే • హెచ్చటంచుఁ
గర్వపడుదాన నాదైన • గర్వమెంచు
టకును దటినెంచి చూచి త • డాల్న తులువ
వాఁడునై నీకు మృతిఁగూర్చె • పాడునలువ 146

క॥ నీవంటివిభుఁడు వోవుచు నీవసుధంబలుగుఱాల • నిటుగూలంగా
భావదభిన్నంబైయొద యీవలనాశంబుగాదొ • హరిహయపుత్రా

దోదకము॥ తమ్మునిభార్య ము • దమ్మునగొంచు
గ్రమ్మగవాని బు • రమ్మటు వెళ్లం
దొమ్మినిగొట్టిన • దోసమునే భు
క్తమ్మిటులాయనె • ధారుణినాధా! 148

మత్తకోకిల॥ మత్తకోకిల సుస్వనమ్ముల • మానినీమణు లెల్లరుం
జిత్తమేమియు నిల్వకేడ్వఁగ • జిన్నికుఱ్ఱఁడునంగదుం
డుత్తలంపడ మిన్నకుండెద • వూరడింపఁగ రాదె నీ
వి త్తఱిన్నను దేర్పకేగిన • నేరు దేర్పఁగ లారికన్॥ 149

వ॥ అనియిట్లు తారామహాదేవి పలువిధంబుల బనవిపనవి భర్తసాన్ని
ధ్యంబున బ్రాయోపవేశంబునందం దలంచియున్నంత. 150

(హనుమంతుఁడు తారకు హితోపదేశంబొనర్చుట)

క॥ నక్షత్రపధమునంగల నక్షత్రమిలాతలమ్ము • నకుడిగు కరణిన్
నక్షత్రసమాఖ్యకడకునక్షత్రపయశుఁడుహనుమ• నవముగఁదూకెన్

వ॥ ఇట్లాంజనేయుండరుదెంచి దుఃఖసాగర నిమగ్నయై విలపించు తా
రావరారోహం దిలకించి విరక్తిమార్గంబున గొంతవడి దుఃఖంబు
జల్లార్చ మృదుమధురవచోమృతంబు వీనులందేపతేపకుంజిలికిన
వాఁడయి మఱియు నామహాదేవికిట్లనియె 152

శా॥ దేవీ! నీవిటులేడ్వ జెల్లునకటా! • దేహాభిమానమ్మునం
దేవీసంఘములందు బెద్దవు మఱెం • తేఁ బ్రాజ్ఞవెన్నంగ ముక్
జీవంబుండఁగ జేయు కర్మఫలమే • సిద్ధించు నీదేహికిం
ధీవర్యుండిది నీటిబుగ్గయని ముం • దేయెంచి తల్చుండెదన్॥ 153

తే॥ పిల్లవాడుండె నీకేల • బెగ్గిలంగ
భావిశుభములనెల్ల గూ • ర్పగస్వతంత్రు
రాలవై మెవిడంగఁ • గారణమదేమి
యెరుకబాపెనె పతిదుఃఖ • మెదనుజేరి॥ 154

క॥ పరసౌఖ్యపరుఁడు భూత్రోత్కరముకలిగి గిట్టుచెల్లకల్లని సలుపం
దొరకొను దతెసౌఖ్యమ్మఁడు నెరపను, లటుగాని వానినెట్టనవీడున్,

చ॥ వనచరరాజ్యమేలెఁదన వైరులనెల్లరఁదోలె, సౌఖ్యమున్
వననిధిఁదేలెఁ బాంధవజనమ్ములగావఁగఁజాలె నార్యభా
వనమగు శాస్త్రసారములఁ బాగుగఁగుర్తెఱుగంగ జాలె, నో
వనజదళాక్షి! కాలగతి వ్రాలినవాలి కేలచింతిలన్ 156

సీ॥ అంగదునకు, గపిహర్యక్షులకుదన్మహారాజ్యమునకు నాధారమీవ!
కావునబట్టమ్ముగట్టికొనగనిల్చి; నంగపుండటుసల్పుమమ్మ!నీవ
పురుషుడెందులకయుపుత్రునిగోరునో;ఘటియిల్లెనదిసేయఁగాంచుమీవ
కాంచినందనుభుజస్కంధంబుననురాజ్య; భారంబునిల్పుముపరగనీవ

గీ॥ నిలిపిదుఃఖమ్ములవ్వల♦ నెట్టుమీవ
నెట్టియానందవారధిం♦ దేలుమీవ
పొరిదినవ్వల మముగృపఁ♦జూడుమీవ
నావుడాతనికిటువల్కె నాతిశేన.

తే॥ కాంజరీపుత్ర! సుత♦ శతకమ్ముకంటె,
విక్రమాఢ్యుడైయనిబడ్డ♦ విభునిదైన
గాఢపరిరంభణమ్ము ని♦క్కముగ శ్రేష్ఠ
తమము మాబోంట్లకనినీవు♦తగ నెఱుంగు

ఉ॥ ఎక్కడిదాన నే నగచ♦రేంద్రునకుం దగుకర్మఁదీర్పఁగా
నెక్కడిదాన నే సుతు గ♦ పీశ్వర రాజ్యమునందునిల్పఁగా
నెక్కడిమాటలన్నియు రు♦మేశ్వరుఁడేసలుపంగ మేటి యం
కెక్కడి సౌఖ్యమాత్మవిభుఁ♦డేగినమీఁదట మించుబోంట్లకున్.

వ. అనిమరియు నాకృశోదరి కేసరీ కిశోరంబునకిట్లనియె.

ఉ॥ ఏటికివేయుమాటలు క♦ పీశ్వర! మత్ప్రియపుత్రుగూర్చినే,
నేటికిసేయబోలిన ప♦నిం గనలేదను, పట్టి చుట్ట మిం
తేటికి తండ్రియేజననియేయెడఁగాదుమఱెందునందు ము
మ్మాటికి భర్తయేగతిసుమా! కమలాక్షులకుందలంపఁగన్. 161

వ. ఇట్లాంజనేయునకు దారావరారోహవల్కుచున్నయెడ

(వాలితన చేసిన యపరాధంబుఁ దలపకుండ సుగ్రీవుఁ బతిమాలుట)

చ॥ అనిమిషనాథనందనుఁడు • నక్షియుగమ్మును విప్పి కాంచి చ
య్యనఘునమైనయూరుపుఁ బ•నూసనుబుచ్చి సమీపమందు, జిం
త నవయుచున్నతార నిజ• నందనునంగదు, దమ్మునర్కజుం
గనుగొని ప్రస్ఫుటోక్తుల వి•క్రన నూతికిఁబల్కె మైత్రిమై.

సీ॥ తమ్ముఁడా సుగ్రీవ! • దయమాలి
వైర•మూనితినని దూరకయ్య
నాకర్మగతి యిట్లు • నన్నిద్దఁగా బలా
త్కారమ్ముగాఁ దెల్పి •తలగెనయ్యఁ
మనమిర్వురము నొక్క • మాటు
గర్భమున గల్గితిమయ్య •రహిని నెయ్య
మున సంచరింపఁగా • బాసగదయ్యెను మన
కదియేమిపాపమో • యరయుమయ్య
గీ॥ ధాతవ్రాతను దప్పింప • దగునటయ్య
నీకిదే పల్కుసుమ్మిక, •నిల్వవయ్య
ప్రాణముల్ బొందిలోపల; • బాయుమయ్య
యీర్ష్యకపిరాజ్యమెంతేని • నేలుమయ్య. 164

క॥ శ్రీవిభవంబును రాజ్య శ్రీ విభుకీర్తియు ధరిత్రి • జీవము నిందుం
బోవిడచి పోవుచుంటిని, నేవిధియాజ్ఞనిటు పద్మ•నీధవతనయా!

వ. అనిమతియుఁ దమ్మునివద్ద జేర్చికొని వాలియిట్లనియె. 166

(వాలి సుగ్రీవునకుఁ గుమారాదుల నప్పగించుట)

ఉ॥ తమ్ముఁడ! నీకు నేనిట ము • దమ్మున బల్కెడు పల్కులెల్ల గ్రో
ధమ్మున నీవు కాదనకి • తమ్మనవించటు నల్పగావలెం
జుమ్మి కుమారునంగదునిఁ • జూచుము నామృతికయ్యె శోకబా
ష్పమ్ములు గ్రమ్మగన్నుఁగవ • వాయఁగ నేడ్చెడు భూమిఁదొర్లుచుఁ,

చ॥ వెనుకయు ముందుఁ జూడడరి • వీరులదున్నెడు పట్ల, విక్రమం
బునను భవన్నిభుండు, జల • ముఘ్నయుఁడాహవమందు, నింకనే

జనిమెద నెల్లుగాంచెదవో ♦ సత్కృపనాదగు ముద్దులాని బె
ల్లనిభయమందబాపుమెద ♦ నాత్మసహోదర! పిల్లడౌగదా! 168

ఉత్సాహ॥ జ్ఞాతిబాంధవాళి కల్ప ♦ సాల మనఘచరిత యహా
త్వాతికంపు జ్ఞానమందు ♦ బండితాగ్రణి సతి నా
హాతితార యలసుషేణ ♦ నందన గుణరాశి బల్
నీతిశాలిదీనినరయు ♦ నీవ్రభక్తి నెంతయున్॥ 169

క॥ తమ్ముడ నీదగుహృత్పద్మమ్మున నీపల్కునిల్పు ♦ మరువకుసుమ్మీ!
ఇమ్మహిపుపనికిదోడ్పడు నెమ్మినినటు సేయకున్న ♦నినుదునుమాడున్

క॥ మఱియును నేజనంగాసిరి దొఱగుంబైడిసరముంచుం♦దోరపుటక్షిన్
నెఱిజనకుండిచ్చెనా,కని కఱిగెడు తఱిదాల్పజయము♦నందిదుసుమ్మీ!

వ॥ అని దీవించి యొసంగిన సుగ్రీవుండు కాంచనమాలంగైకొనియున్న
నిజనందనుం దగ్గరకు జేర్చి చుంచుదువ్వి ముద్దాడి బ్రీతి పూర్వకం
బుగనిట్లనియె. 172

ఆ॥ ఒంటినమ్మబల్కి ♦ రెంటికినోర్చి మూడింటినెఱిగినాలు♦గింటిగొనుము
రెంటినేదిరాని♦దంటతనముమీర మెలగి పిన్నతండ్రి♦గొలువుతండ్రి!

క॥ చనువునఁబ్రియమున భయమున
దనయెడ మెలగంగనిన్ను ♦ దయగనుజుమ్మీ.
పినతండ్రి కాన నాతో
డనటించినలాగు గొమరు ♦ డాతిరుగుమురా॥ 174

క॥ ఓరిమినర్కజుపనులం గూరిమిగొమరుండ! మెలగు♦గురుమతినెపుడున్
సౌరియమిత్రుల మిత్రులజేరి యరయకీవుచెల్మి♦ సేయకుమెంతేన్॥

క॥ ఏతఱి నస్నేహమ్మును నాతతమగుచెల్మిసల్ప ♦ నాపదలబ్బున్
నాతగ్రణి!జాగరూకత భూతలమున మెలగుమెపుడు♦బుధులెన్నంగన్॥

(వాలి ప్రాణంబులు విడుచుట)

వ॥ అని యిట్లు గొమరునకుం బుద్ధిగఱపి వానరేంద్రుండైన వాలి రా
మబాణహాతి బీడితుండై గ్రుడ్లు గిరగిరంద్రిప్పి బ్రాణంబులు విడిచి
నంత. 177

ఉ॥ ఏడ్చిరి వానరౌఘములు ♦ నెంతయు వన్నెదొలంగఁ దత్పురం
బేడ్చిరి పుత్త్రుఁడాదిఁగ గ♦ పీంద్రులుగాణ నెదిర్చెనంచుఁ దా
మోడ్చిరి మోముదమ్ములను ♦ ముద్దులగుమ్మలు దుఃఖమోర్వలే
కేడ్చిరి తక్కువారు వనమెల్లను ♦ గాంతిదొలంగ వాలిఫ్రా॥ 178

ఉ॥ పురపురబొక్కుచొద్దకటు ♦ వోయి మొగమ్మునమోముజేర్చి మం
ధరధరమో యనంబడిన ♦ ధారుణినాయకువాలికిట్లనుఙ్
వగనఘకాంతితారయగు ♦ వానరనాయకుదారతార హా
ద్వార! మునునానుడిన్వినక ♦ ప్రాణము బాణముపాలుసేసితే॥ 179

క॥ ఎంతటిప్రియురాలైనం జెంతన్నే నిలచియుండ ♦ స్థిరకౌగిటిలో
గాంతుడ! నిలిచిపలుకకీవంతుననునంతద్రోయఁ ♦ బాడియ చెపుమా॥

వనమయూరము॥ ఒక్కయెడ బుత్త్రుఁడుమ ♦ ఱొక్కయెడదమ్ముం
డొక్కయెడ మిత్త్రులు మ ♦ ఱొక్కయెడ నేనుం
బొక్కనిదియేమనుచుఁ ♦ బుత్త్రకుని నైనం
దిక్కఱతిదాయనుచుఁ ♦ దేర్చవిది మేలా॥ 181

మానిని॥ నాపతి నాగతి నాధృతి నామతి ♦ నావిధినా చెలి నాశముగా
నాపతిజల్పినదే మొకొ నామతి ♦ యంతటభిన్నములై చనకే
యీపగిదిం జలియింపక నుండెదు ♦ నెందరుపుత్త్రులు పుత్త్రికలే
నాపతిబోలుదు రాతలపోయగ ♦ నన్ను వెలార్చితె దుష్టవిధీ!

మందాక్రాంత॥ రామారత్నంబిటులు వగవన్ ♦ రామబాణమ్ము నాసా
త్రామాజ్ఞంబాదురు ఘణివలెం♦ గ్రాలనీలుండువాపెన్
ఈమాద్రిం బాపఁగనుదయభూ♦భృద్దరిం బాసిదాగ్రా
లామాన్యంపస్రమన దగెన♦య్యమ్ము రక్తాన్వితంబై.

మధ్యాక్కర॥ అపుడుతచ్ఛరమట్టితీయ♦నైంద్రిదేహమునుండి నల్ల
విపులగోత్రమగల్చి కెంపు♦టేటినేలల బాఱివచ్చు
విపులమానది యోయనంగఁ♦ బెల్లుగాఁబ్రవహించెఁ జెల్ల
కపులునెల్లరుభ్రాంతిమీఱఁ♦గంఠనుర్వులజాలహెచ్చి॥

వ॥ అంతఁ బుత్త్రుంగాంచి 185

తే॥ నాయనా! నీవి కేఁటని • నా!యనాయ
టంచు బిల్చెదుకడ • సారియంచు నెంచి
మ్రొక్కరా తండ్రి యని తన • పుత్రుచేతఁ
బతికి మ్రొక్కించె నప్పుడు • పద్మనయన॥ 186

తే॥ వేలుపులఁజేఁడుకాంచన•మాలనిచ్చెఁగాదనానాథ! లేదేలకంఠమందు
నిన్ను సాధించిరవిజుండు•నేలగూల్చి యొడిచెనాదానిఁగూడదా•నోర్వలేక

(సుగ్రీవుఁడన్నఁజంపినందులకు విచారపడుట)

శా॥ గోలాంగూలకుమారతారలుమహా • ఘోరార్తిసేద్వన్ రుమా
బాలారత్నఁధవుండు గన్గొనికటా! • బారంపుదుఃఖానకే
మూలంబై తినటంచునెంచి సకలం • బుఃఖరోసి శ్రీరామభూ
పాలగ్రామణిగాంచి మ్రొక్కిపలుకీ • భంగిందరాస్వీతుఁడై॥ 188

శా॥ రామా! రాజలలామ! నీప్రతినదీ • ర్ఘంజాలితింకేల నీ
భామారత్నముఁబోయగాదగిన శుం • భద్వీర్యలంబంపుదే
నీమాన్యంపుఁగపీంద్రరాజ్యమును సుం • తేనొల్ల నేనేగదం
బో మాయన్నకుదోడుగా దివికి నీ • భూరివ్యథంబాపగన్॥ 189

శా॥ ఆపై వాలికుమారుడంగదుఁడు పూ • జ్యంబైన రాజ్యంబు నే
లాపై నిల్చినవారితో మిగులుకార్యం • బీసునెగ్గించు కొం
డీ పాపంబుహరించు నాదయిన య • న్నే పోవగా రాజ్యమూ
కాపాడంగలదింక నన్ను గమలా • క్షాపంపు స్వర్గానకున్॥ 190

చ॥ పితృసముజంపినాడనట • బెంగొలకున్వడిగట్టినాడ నే
నతివెతఁబుంగినాడ మహి • నారడిపాలయిపోయినాడ నా
ధృతినిదొఱంగినాడ క్షితి • భృత్యులు నీదరిఁజేరికూడ నే
మతిచెడినాడ నేలపలు • మాటలు నాకిఁకమ్మాజ్ఞమిత్రుఁడా! 191

క॥ మునుపటివలె నీ మలపై బనుపడనిలచినని కేలఁ•వచ్చుచునాకున్
నినుననగనేలదురితంబినుమడినన్నేర్చుచుండ•నెంతయురామా! 192

తే॥ భ్రాతతో భ్రాతృజాయతో • భ్రాతృసూను
తోహితముఖపొంచె నగ్నిలో • ద్రోతుమేను

త్వద్రమణిరోయు నీకు త • ద్వార్తదెల్పె
నామె దేఁదోడరాఁగల • రగచరుల దె॥ 193

చ॥ అదియునుగాక నేమరణ • మందిన నీపనికాక పోదుసూ!
విదితబలుండ వెంతయు వి • వేకివి జాలవలంతి వెర్గుదే
నదియటులుండ నాకనృత • మబ్బునటంచొక కొంతభీతి నా
హృదిదవిలెందినేశకుల • హేమకజాకర బాలభాస్కరా! 194

చ॥ అన విని రామచంద్రుఁడు కృ • పాకరుఁడౌటను మిత్రపుత్రుఁగ
న్గొనుచు ముహూర్తమాత్రము క • నుంగవశోకజలంబునించి తా
రనురహి నూరడింపఁ జనె • భ్రాతయులోనగువారు మార్గముం
దనకునమర్చి వాలి నల • తారను వేరుపడంగ జేయఁగన్ 195

(తార తన్నుఁదునుమాడ రాము వేఁడుకొనుట)

ఉ॥ ఆవనజాక్షి తార వన • జాయతనేత్రుని రాముగాంచి ల
జ్జావనతాననాబ్జయయి • యాతని ప్రాంచితలక్షణాదులం
భావన సేసి రాముఁడని • స్వాంతమునందు నెఱింగి భక్తిలో
కావనశాలికాతని కి • టాడె. స్వభర్తృవధార్తదుఃఖియై 196

చ॥ అమలగుణాభిరామ! సుజనావనకామ! దినేశధామ! స
ద్విమలయశోభిరామ! భవ • భీకరధర్మవిరామ! జానకీ
కమలభవాస్యకామ! వర • కార్ముకకాండకరాబ్జరామ! నీ
విమలశరమ్ముతోఁ దునుమ • వే! ననునాథునిచెంతఁ జేర్చవే! 197

ఉ॥ నీవలగోత్రమూలమున • నీరజనేత్రికి నేడ్చినట్టుగా
నావగకాదు నాకమున • నాకయి బెగ్గిలుచుండు గావునం
భూవర! నన్ను నీదుశర • ముంగొని వ్రాల్చుము భార్యభర్తకుం
జీవము నాగనూకొనమొ • చెప్పఁగ లేదొకో వేదశాస్త్రముల్ 198

సుగంధి॥ స్త్రీవధంబు పాతకంబు • దీనిఁగూర్పనేల నా
కేవిధంబుచేతనైన • నేయుమాశరమ్మునో
క్ష్మావరాభిరామ! దిక్కు • మాలినట్టిదాన న
న్నావరాజ్యమందు జేర్చి • నన్ను బ్రోవుమా కృపన్ 199

వ॥ అని యిట్లెల్ల వితమ్ముల దన్నుదునుమాడ వేడుకొనుచున్న తారా
వరారోహ నాశ్వాసింపం దలంపుగలవాడయి రయంబున 200

(రాముఁడు దారనూరార్చుట)

కందద్వయగర్భిత భాస్కర విలసితము

ధారుణిరమణుఁడు వల్కెను దారా!♦తత్వనిధివిఘన♦తరమతివిన్ శ్రీ
మీరినగుణివిటులాడుట మేరా!♦మేటిక్షితిపుఁడును♦మృతిగనకున్నే
సారసభవుఁడుజగమ్ముల సారా♦సారము లెఱిఁగి వి♦శదముగఁ జేయున్
వారకసుఖమునుదుఃఖము వైరా♦వైరములఅయక♦బనుచునతం డే

ఉ॥ కోవిద! పల్కు, దేహమున ♦ కో మఱి జీవునకో మనమ్ములో
నీవిటు లేడ్చుటల్ మెయికి ♦ నేడ్చుటకూడదు నిల్చియుంటచేఁ
జీవున కేడ్చుదేని విను ♦ జీవుఁడుపుట్టుచుచావ డేడకుం
బోవుట నిల్చుటేయెరుగ ♦ బోడుసుమీ మఱినిక్కమింతయున్ 202

ఆ॥ వె॥ తాతగీతతుడుప ♦, దరవహాన యే వాని
కైనగాని జగము ♦ లందు నెందు
తాతవ్రాతరీతి ♦ భూతలంబున సక
లంబుజరుగుఁగాద ♦ డంబుమీర 203

ఆ॥ వె॥ పోయినట్టివారు ♦ బురపురబొక్కంగ
తిరిగివత్తురెట్లు ♦ తెలుపుమమ్మ
ప్రేతకేడ్వఁదగవ ♦ పీనుంగుతోఁజాగ
రణమదెంతతడవు ♦ రణమహార్వి 204

క॥ కాలమ్ముబ్రహ్మరూపము కాలమ్మఖిలమ్మునేది♦కలిగినజగతిం
గాలమ్మువలనగలుగుంగాలమ్మున బెఱుగుతఱుగుగద♦వీరసతీ! 205

ఉత్సాహ॥ వీరపత్నివైన నీకు ♦ వెక్కి వెక్కి యేడ్వఁగాఁ
గారణమ్ముఁబల్కుమీవు ♦ గన్న పుత్రునంగదున్
సారయౌవరాజ్యమందు ♦ జక్కనిల్పి నీదు క
న్నారజూచి కొమ్మునెమ్మ ♦ నమ్ము నుబ్బజెందగన్ 206

తే॥ ఇంద్రిదిసేసినపాపపు • న్యామ్యవలన
మున్న పాపమ్ము భూమిపైఁ • బొందినాఁడు
మీఁదస్వఃపురమున కేగె • మిగులు పుణ్య
ధనము ననుభవింపఁగ నెంచి • తలిరుబోణి 207

(రాముఁడు తారాసుగ్రీవాంగదుల నూరార్చి వాలి కగ్నికార్యంబు జేయించుట)

చ॥ అని మఱికొన్ని తత్త్వవిష • యమ్ములనింపుగ ముచ్చటించి బే
ర్కొనినమహార్తి వాలికొమ • రుం బ్రియసూతికిఁదమ్ముఁగుజ్జకున్
విని హత శాత్రవుండు రఘు • వీరుఁడువాపి సురేశసూతికా
తని సుతుచేత ముంజరుగ • దగ్గపనుల్ జరగింపుడంచనెన్ 208

సీ॥ అవుడు సుమిత్రాజుఁ • డమ్మహేంద్రజు సంస్క
రింప నర్కజునెచ్చ • రింపనాతఁ
డంగదుండునుదాను • నాతారుఁడరిగితె
చ్చినయట్టి చొక్కంపు • శిబిక వేద
విధినింద్రజుం జేర్చి • వెలగలబట్టలు
నగలుగై సేసి హా • హాగణమెత్తి
మ్రోయఁదారాదులు • మొత్తోయనుచునేడ్వ
వానరీజనములా • పైని నార్వ
నొక్కవాకదరిం జేర్చి • పొక్కుదార
వానరీజనముల నెట్టి • వాలిజీతిని
జేర్చి వహ్నిని బెట్టించి • వార్చితిలలు
నీళ్లు విడిపించె సుతుచేత • విడిచె దాను 209

క॥ హరిహయనందనుసిటుసంస్కరించిరఘురాము జేరె•మార్తాండజుఁడా
గజితలతో దారాసతి యతిగెంగిష్కింధ జేర•నార్తింబడుచున్ 210

(హనుమంతుఁడర్కజపట్టాభిషేకమ్మునకై రాముని వేడుట)

క॥ హరిసుతుని గెల్చితీవని
హరిసుతుసచివాళిబొగడె • నాత్మప్రభువున్

హరిబలముగొలువ రాముఁడు
హరిబలముగ సురలుగొలువ • నలరినటుల దగెన్ 211

సుగంధి॥ కేసరిప్రసూతుఁడంత • గేలుమోడ్చి రాఘవుం
డాసిపల్కె మైథిలీసనాథ! నీసహాయతన్
వాసవాత్మజుండు రాన • వ్రాల్చిగల్గియిక్కనిం
డాసినిల్చె నాజ్ఞయిమ్ము • నాగరమ్ము జేరగన్ 212

సుగంధి॥ స్వామి! నీదుపల్కుమీఁద • పట్టణమ్ము జేరి మా
స్వామి తాఁ గృతాభిషేక • సంపదన్ వహింపఁగాఁ
బ్రేమగోరుచుండె రండు • బెల్లుగాలునల్లదే
శ్రీమహేంద్రుఁడెంకిపోల్పు • రింజొలంగ నెంతయేన్ 213

వ॥ అని పల్కిన 214

[రాముఁడు సుగ్రీవపట్టాభిషేకమునకు లక్ష్మణుఁబంపుట]

పంచచామరము॥ పురంబుజేరనొల్ల దండ్రి • మున్నొసంగునాజ్ఞ చేఁ
బురంబుజేరి పద్మమిత్ర • పుత్రుఁడాధిపత్యముం
గరంబుడంబుమీర మీరు • కైవసంబు సల్పగం
దిరంబుగన్వహించుగాత • నెమ్మిరాజ్యభారమున్

తరల॥ అనిరవిప్రియసూతికిట్లను • నర్కనందన! లక్ష్మణుం
బనిచెదీరలతోడ నాకైన • వాఁడొనర్చభిషేకముం
జనుము టెంకికి నైంద్రిబిడ్డకు • జక్కఁగా యువరాజ్యమి
మ్మనుగుదోఁడు గొమారుడాంగద • హర్షితంబుధులౌనన్ 216

ఉత్సాహ॥ శ్రావణంబువచ్చెనిపుడు • సాగవెట్టికార్యముల్
నీవువానకారుబుచ్చి • నిండుగూర్మిఁ పేర్మిసీ
తావరాంగి వెదకజాలు • దంటలంబనుపుము సు
గ్రీవుడా! సుమంగలసిసు • ఖింపుమంతవట్టునన్ 217

క॥ అనిరామచంద్రుఁడప్పుడు తనతమ్మునినిచ్చినర్క • తనయునిగిష్కిం
ధను జేరబుచ్చితన్నిక టనగమ్మునవనిల్చెవిల్ వి•డంబింపఁగయున్ 218

(సుగ్రీవాదులుకిష్కింధకేగుట)

క॥ ఈకరణిరాముసెలవుం గైకొనిమంత్రులునుదాను • ఖరకలసుతుఁడా
కైకేయానుజమణితో నాకొట్టికకరిగినిజగృహమునకుజనుచోఁ

(పత్తనస్త్రీలులక్ష్మణాదులంబ్రశంసించుట)

సీ॥ ఇతఁడచేమనరాజు • నెలమిబట్టాభిషి
క్తునిజేసిమనకింపు • గూర్చువాఁడు
ఇతఁడచేరఘువీరు • నిలకన్నెనేప్రొద్దు
గొల్చిమెప్పొందిన • గొప్పవాఁడు
ఇతఁడచేతనయన్న • సినసూనుతోఁబొందు
సేయఁబ్రేరేచినచిన్నవాఁడు
ఇతఁడచేసుగ్రీవు • నీరాజ్యరమతోడ
గుమతోడజేర్పనే • ర్పుఁగలవాఁడు
ఇతఁడచేయూర్మిళాదేవి • యెమ్మెకాఁడు
ముగుదరోయీతఁడసుమిత్ర • ముద్దులాఁడు
పడతివీఁడచెరాముత • మ్ముఁడగువాఁడు
వనితవీఁడచెబంగారు • వన్నెవాఁడు. 220

వ॥ అనియిట్లుశుభలక్షణుండైన లక్ష్మణుంబ్రశంసించి. 221

సీ। మనలనేలెడువాఁడు • మర్యాదఁగలవాఁడు
మార్తాండజుఁడువాఁడెమగువజూడు
రవికాంతిగలవాఁడు • రాముబంటగువాఁడు
నాంజనేయుఁడుపీఁడెయమ్మచూడు
నెఱిదొరంగినవాఁడు • నెరిదండ్రిబడవీఁడు
నంగదుండనువాఁడు • నతివజూడు
చెక్కుమీఱినవారు • నుక్కుమీఱినవారు
తక్కువృతుచరుల • దరుణిచూడు
మెచ్చుచుసౌధాంతరమ్ముల • నబలలెల్ల
తోడిచెలులకుజూపుచు • దొడరియుల్ల

ములనురంజిల్లనుత్సాహ ♦ ములనునల్ల
నల్లమల్లెలాజల ♦ జల్లిరహహా! 222

ఉ॥ అప్పుడుపౌరవృద్ధులును ♦ దాన్వితులై యెదురేగుదెంచి బ
ల్లొప్పుగ మ్రొక్కియర్జున ♦ కొయ్యనమన్ననగాంచి వెంటరా
నప్పురహూతసూతిసతి ♦ యార్తినిగుందగనూరడించియా
కప్పురగంధిదాసెలవు ♦ గైకొనిభానుసుతుండు వేడుకన్ 223

[పత్తనంబునలంకరించుట]

క॥ ఈలీలవారలందరు లాలితగతిగృహముజేరి ♦ లక్ష్మణునాజ్ఞన్
హేళితనూభవునకుబడి బాళినినభిషేకమొనరు♦పందలచివెసన్ 224

సీ॥ పట్టాభిషేకమ్ము ♦ పత్తనంబునలం కరిం
పుడంచనియుజాటిం ♦ పువారు
మహితగోపురసౌధ ♦ మంటపమ్ములపైన
పుత్తడికుండల ♦ నెత్తువారు
రంగారుబంగారు ♦ రాచపెన్నిక్కల
చిత్రపటములగై ♦ సేయువారు
కప్రంపుటనటుల ♦ గైసేసిముంగిళ్లు
లలితకస్తూరిని ♦ నలుకువారు
గేయమగురాజవీధిగై ♦ సేయువారు
బసిడిచేలలయుల్లెడ ♦ ల్బన్ను వారు
కోర్కినభిషేకవస్తువు ♦ ల్గూర్చువారు
కానిపెరవారలేరున ♦ గరునలేరు 225

సుగ్రీవపట్టాభిషేకము

చ॥ ధిషణుఁడువెట్టినట్టియొక ♦ దివ్యతమంపుముహూర్తమందుమా
నుషపతిలక్ష్మణుండురుమ ♦ నోచిననోములపంటకయ్యెడన్
ధిషణుఁడుమున్ను నేపగిది ♦ దేవగణేశుగృతాభిషేకమున్
వృషరథుడెన్నజల్పెనటు ♦ ప్రేముడినర్కికిజల్పిరంతయున్ 226

ఉ॥ దివ్యసువర్ణవస్త్రముల ♦ దివ్యసుగంధరసవ్రజమ్ములన్
దివ్యసుమవ్రజమ్ములను ♦ దివ్యశుభాక్షతకాంచనమ్ములం
దివ్యకిరీంద్రచర్మముల ♦ ద్వీపిశరీరపుఁదోల్ల దేనియం
దివ్యకిసాలయమ్ములను ♦ దివ్యమణీశిలసే బెఱుంగుతోన్ 227

ఉత్సాహ॥ లేపనమ్ముగొంచుభూమి ♦ లేఖపాళిదృప్తిగాఁ
దీపితమ్ములైనవస్త్ర ♦ దివ్యభోజనమ్ములన్
లోపమింత లేదటంచులోకులెన్న జేసిత
త్రోక్కపనలకుఁజాలమంచి ♦ కోకలునగలిచ్చిరా 228

ఉ॥ ప్రేమను వేదపక్కిని బ ♦ రిస్తరణంబులమధ్యనగ్ని నెం
తేముదమారనుంచిక్షితి ♦ దేవ్రలుబల్కఁగఁబూతిమంత్రముల్
హోమమొనర్చిప్రాజ్ఞులుమ ♦ హోన్నతస్వర్ణఘట్టితంబునై
హైమదుకూలవస్త్రనిచ ♦ యావృతమానోకమంటపమ్మునన్ 229

మ॥ రతనాల్ గద్దియదూర్పమోముగనుమా ♦ రాండాత్మజున్నిల్పిత
చ్చతురంభోధినదీనదాంబువ్రులమిం ♦ చం జేసి వేహోన్నుండలన్
దతగోశృంగసువర్ణపాత్రములచే ♦ తన్మించి వేదోక్తులన్
జతగామైందుఁడుగంధమాధఁనుడు కే ♦ సర్యాత్మజుండాదిగన్ 230

క॥ సురపతికిసురలొనర్చిన సరణింగపిపతికిగపిని ♦ చయమభిషేకం
బరుదారజలిపెనెంతేనిరుపమమగు లక్ష్మణోక్తి ♦ నిర్జరులెన్నన్ 231

వ॥ ఇట్లుపట్టాభిషేకంబొనర్చినయనంతరంబ 232

క॥ అంగదునిసర్కజండొక బంగరుగద్దెపయినిల్పి ♦ పలువురుమెచ్చన్
బొంగుచుయువరాజుంగా రంగుగనుత్సవముఁజల్పె ♦ రామాజ్ఞదమిన్

క॥ వానరులెల్లరులక్ష్మణు మానుగబూజించిరర్కి ♦ మఱిమఱిచెప్పన్
మానయినవస్త్రభూషలమానవపతిరాముపోల్కి ♦ మన్ననెంతే234

సీ॥ ఒకవంకలక్ష్మణుం ♦ డొకవంకనంగదుం
డర్హాసనమ్ముల ♦ నమరియుండ
ఒకవంకహనుమంతుఁ ♦ డొకవంకదారుండు
కావ్యగీష్పతులట్లు ♦ గ్రాలుచుండ

ఒకవంక మైందుండు ♦ నొకవంక ద్వివిదుండు
బంగారు నెత్తము ♦ ల్బట్టియుండ
ఒకవంక నీలుండు ♦ నొకవంక జాంబవదా
దులేయెడందన్ను ♦ నానియుండ
శ్రీరుమాదేవి వామాంక ♦ సీమనుండ
భటుండు వెలిపట్టుగొడుగొండు ♦ బట్టియుండ
వెలది వింజారములు బట్టి ♦ వీచుచుండ
జెలగె రవిజుండు బట్టాభి ♦ షేకుడగుచు 235

క॥ రమణీయ రాజ్యరమతో
రుమతో గూడి రవిజుండు ♦ బ్రొద్దున్నెలయుం
క్ష్మ గలిగినన్ని నాళ్లును
స మతంగపిరాజ్యమేలె ♦ సత్యము మెరయన్ 236

క॥ అలజడిగలారు దుఃఖము గలారు నిప్పచ్చరంబు ♦ గలవారు రుజల్
గలవారజ్ఞానమ్మును గలారు నయ్యేలుబడిని ♦ గనబడరెందున్ 237

క॥ ఈకరణి నెల్లరెన్న బ్రభాకరతనయుండు నన్న ♦ పట్టియు దానుం
జోకన లవానకాలము వీక శరదృతువు రాగ వేడుక మీరన్ 238

(సుగ్రీవుండు రామకార్యము నిర్వర్తించి వచ్చుట)

సీ॥ హనుమంతుడాదిగా ♦ నాత్మబలమ్ముల
నాయాయి దిక్కుల ♦ కమరబంచి
జానకిజాడయుం ♦ జనిపట్టి దెలిసి
దానందరకెరిగించ ♦ నాలకించి
వానరౌఘములచే ♦ వారిధి గట్టించి
లలితమార్గమ్మున ♦ లంకగాంచి
సుతబంధుహితులతో ♦ సురవైరి రావణుం
దనసహాయత రాము ♦ డనివధించి
మించి రిపుసోదరుని లంక ♦ మెరయనుంచి
భూమిజను గూడి సాకేత ♦ పురిగమించి

సరగనభిషిక్తుఁడై రామ • చంద్రుఁడంచి
ననుపురము జేరె నర్కసం • తనముగాంచి 239

తే॥ శ్రీరుమాజాని పర్వత • శ్రేష్ఠభూమి
సురలుగొల్వంగ లోకమ్ము • నేకనేలె
శ్రీరుమాజాని పర్వత • శ్రేష్ఠభూమి
హరులుగొల్వంగ గపిరాజ్య • మమర నేలె 240

క॥ ఎందాకసూర్యచంద్రులు నెందాకందారకాళి నెసగుం • ధరపై
నందాక సలరు నీకృతి బృందారక వినతు రాము • కృపచేతసిలన్ 241

[ఫలశ్రుతి]

క॥ ఈకృతిఁ జదివిన వ్రాసిన నీకలియుగజనులకఘము • లెల్లనడగిసీ
తాకళ్యాణవతీపతిదాకృపసంపదలు బల్ర • యమ్మోనబ్బున్ 242

తే॥ కాలగుణ వసువిధుసంజ్ఞ • శాలివాహ
నశకమబెంజదువిఘని శా • నాథసంజ్ఞ
హాయనశక మేగ నీకృతి • నొప్పఁగుల్క
శ్రీరఘూద్వహుఁ కృపచేర • ఁ జించినాడ 243
అబ్బరాడ్ఢనుమంతరావ నెఱువాడ

ఆశ్వాసాంతము

తోటకము॥ తతకమ్రకులాంబుజ • ధామనిధీ!
నుతపుణ్యచరిత్ర! మ • నోజ్ఞసుఖా!
క్రతుభుగ్గవిదాన! య • గర్వమతీ!
అతులోజ్వలకీర్తి! జ • తాజనతీ! 244

పుష్పమాలికాబంధము.

చ॥ ఖరకరసార తేజ! కవి • కల్పక! ముత్యమకామ! కామసుం
దర! ధరధీర! మేరుధర • ధర్మధరాంఘ్రిజ తేజపంజరాం
తరచరసారభృంగ! ధర • ధర్మధరాధర హార హీర గో
షర! దరవారకీరపర • పక్షు! పకీరయ! గేయదాయకా! 245

మంగళమహాశ్రీవృత్తము

శ్రీమహితకమ్మకుల•క్షీరమకరాకరవి•శేషపరిపూర్ణతరచంద్రా!
రామపదపద్మవిచ•రన్మధుదవర్య! ధన•రాజనిభధర్మగుణసాంద్రా!
కోమలహాసత్సుముఖ!కోటయసమాఖ్యసుత!కోవిద!సుభోగదివిజేంద్రా
క్షేమకరరాజమ"ప•కీరయ"సుధీవినుత•కీర్తిదిజితాదిమఫణీంద్రా! 246

నిరోష్ఠ్యకందము

ధరణీతనయానాయకచరణసదారాధనాతి•సక్తహృదయ!
శ్రీకర!కోటయాగ్రనందన!సరసాగ్రణి!యేల్లగడ్డ•సంతతితిలకా!247

సంపూర్ణము.



శ్రీ

బుధజనులారా!    చదువరులారా!!

# తప్పొప్పుల పట్టిక



ఈ సుగ్రీవపట్టాభిషేకమున శుద్ధపత్రము విశేషముగఁ బడకుండ ముద్రింపింతమని నేనెంతగాఁ బ్రయత్నించినను గొన్ని కారణములవలన నాకోరిక కొనసాగమికి విచారపడుచుఁ బ్రస్తుతమున నాకు సాధ్యమగు నంతవరకు దిద్ది యీశుద్ధపత్ర మిందుఁ జేర్చినాఁడ. ప్రాజ్ఞులైనవారు నా తప్పులు క్షమించి యొప్పులు గ్రహించి నన్ను మన్నించినఁ బునర్ముద్రణమునఁ గొఱవడినవానిం దిద్దికొనెద.

ఇట్లు బుధవిధేయుఁడు,
కృతికర్త.

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 3 | 1 | 1 | ద్రాక్ష | దాక్ష |
| 4 | వచనము | 1 | యంత | యెంత |
| | | 7 | యిష్టమె | యిష్టమై |
| | | 10 | వ్రాశి | వ్రాసి |
| | | 16 | వ్రాశి | వ్రాసి |
| 5 | | 8 | యచ్చట | యచ్చటచ్చట |
| 6 | 2 | 3 | తరులసు | తరులను |
| 7 | 9 | | వర్న్ననముము | వర్ణనము |
| | | 11 | దొనరు | దొవరు |
| 9 | 15 | 2 | జిగాజిగ | జగాజిగి |
| | 16 | 4 | దిజ్ని | దిజ్ఞి |
| | 18 | | యూత్ర | యాత్ర |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- | --- |
| | | 1 | ప్రబధాసు | ప్రబధాను |
| | | 2 | మూావు | మూావు |
| | | 3 | దార్చి | దాల్చి |
| 10 | 21 | 1 | ఆకారమున | ఆకారముల |
| 11 | వచనము | 2 | అనివించు | అనిపించు |
| | | 10 | చిలత | చిలుక |
| 13 | 1 | 1 | కసఙ | కనర్ |
| | 2 | 7 | అంరీభష | అంబరీష |
| | వచనము | 2 | కృతికర్త | కృతిభర్త |
| | | 6 | తొాందర | తొాందరల |
| | | 11 | అల్లెడ | అల్లెద |
| | | 13 | వేర్పర్పడుచూడ | విమర్శనలేర్పడు చుండ |
| 14 | | 1 | పాత్రము | పొత్రము |
| | | 2 | సెఱుగు | నెఱుఁగు |
| | | 5 | సినే | నేనే |
| | | 10 | సెత్రి | నెత్రి |
| | | 16 | స్లెల్ల | నెల్ల |
| | | 17 | స్లెల్ల | నెల్ల |
| | | 18 | స్లెల్ల | నెల్ల |
| | | 22 | దోనెపోడి | 1-1-1912 దోనెపూడి |

ప్రథమాశ్వాసము.

| | | | | |
| --- | --- | --- | --- | --- |
| 1 | 1 | | శంకరుండు | శంకరుఁడు |
| 2 | | 3 | దాన | దాస |
| | 4 | 2 | వ్రాక | వాఁక |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 5 | 19 | 2 | మోములుః | మోములుం |
| | | 6 | దబ్జ | దబ్బ |
| | | 8 | నహి | నలి |
| 6 | 22 | 2 | జింము | జందు |
| | 29 | 2 | గనులకు | గన్రులకు |
| | | 3 | పీరుగ | దీరుగ |
| 2 | 56 | 1 | పిల | పిలి |
| | 58 | 6 | మేత | యెత |
| 13 | 61 | 1 | బంత | బనంత |
| | 63 | 3 | నిక్షీణ | నక్షీణ |
| 16 | 77 | 5 | లక్ష్మి | లక్ష్మి |
| 17 | 78 | 11 | మన | ము |
| | 81 | 1 | కీ్తిం | కీర్తి |
| 18 | 84 | 8 | బొాట్లు | బొాల్లు |
| | 86 | 1 | నెవ్యా | నేవ్యా |
| 19 | 90 | 1 | సాంబయూహా | సాంబుజాతా |
| | | 3 | కరుణజమా | కరుణామా |
| | 93 | 3 | చున్నా | చునా |
| 23 | 114 | 10 | మిాట | మేటి |
| 24 | 118 | 2 | గుబృద్యా | గుభృద్యావళి |
| 26 | 127 | 10 | పుష్ప | పుష్ట |
| | | 12 | డమి | దమి |
| | | 22 | కరయ | కరము |
| 27 | 134 | 2 | చెప్పు | చొప్పు |
| | | 1 | గొాదవె | గొాదల |
| 29 | 144 | 2 | వికాశ | వికాస |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 30 | 147 | 2 | ముయించెన్ | ముదయించెన్ |
| | 151 | 1 | మర్ధి | మత్తి |
| 32 | 166 | 4 | తోడన్ | తోన్ |
| | 171 | 1 | మొదల | మొదలు |
| 34 | 181 | 4 | న్వితలై | న్వితములై |
| 35 | 184 | 2 | చూపు | రూపు |
| 37 | 199 | 4 | గుంట | పుట |
| 38 | 205 | 2 | తోను | నుతో |
| | | | డాహా | వాహా |
| | 206 | 4 | హింకకాచలట | హింకటకాచల |
| | | | ద్వితీయాశ్వాసము. | |
| 41 | 10 | 1 | వేళ్లా | లేళ్లా |
| 43 | 19 | 3 | బటికా | బటిరా |
| | 20 | 2 | సుషేణునిన్ | సుషేణుఁడున్ |
| | 21 | 3 | వెలిగాఁడా | వెలిగానా |
| 44 | 25 | 1 | సుషేణుఁడు | సుషేణుఁడ |
| | 26 | 1 | నట్లు | నల్లు |
| 45 | 29 | 2 | జిగాజిగ | జగాజిగి |
| | 32 | 1 | జుట్టు | జిట్టు |
| | 34 | 1 | రాయిగ | రాఁగయి |
| 46 | 37 | 1 | కుమారు | కుమార |
| 47 | 47 | 7 | దాల్చు | దాల్చి |
| 48 | 51 | 6 | నాతి | నాలి |
| 49 | 54 | 3 | దురివో | దురిలో |
| | | 4 | నుర్వీరుట్సు | నుర్వీరుట్చు |
| | 56 | 8 | జుట్టు | జుక్క |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| | | 12 | వారి | వాలి |
| 50 | 57 | 4 | జాలు జూాలు | జూాలు |
| | | 10 | త్రోజేడు | త్రోటేడు |
| | 59 | 3 | దర | వర |
| | | 10 | లేపి | వేపి |
| 51 | 64 | 4 | మెత్రాలిచేఁ | మైత్రాలిచేఁ |
| | 65 | 1 | కొడిఁ | కొరిఁ |
| 52 | 73 | 6 | కేకేఁ | కేల |
| | | 11 | గుబ్బల | గుబ్బలి |
| 53 | 77 | 2 | ష్వైష్ణుధిఁ | స్వైష్ణుధిఁ |
| | 79 | 2 | వేడ | లేడ |
| | | 5 | వేడ | లేడ |
| | | 6 | దేడ | లేద |
| | | 8 | వేడ | లేడ |
| 55 | 86 | 4 | నెరకు | దొరకు |
| 56 | 93 | 1 | బూన్రెటు | బూవ్రటె |
| | 96 | 3 | గారఁపుల్కు | గారఁపుఁగెల్కు |
| 58 | 103 | 4 | విడిన | నిడిన |
| 59 | 105 | 2 | బెట్టు | రెట్టు |
| | | 15 | నేల | యేల |
| | | | తేవలెనేల | తెవలయుయేల |
| 61 | 114 | 3 | నంచు | నంచ |
| 64 | 120 | 1 | ఓలని | ఓలిని |
| | | | త్రోబక | త్రోదక |
| 64 | 132 | 2 | వెల్గు | లెఁగు |
| 66 | 141 | 5 | ఘ్మళ | ఘ్నళ |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| | | 12 | దాని | వాని |
| 68 | 150 | 1 | వల | నల |
| 69 | 153 | 4 | షోత | ష్లోక |
| 72 | 172 | 8 | నెమ్మ్రని | నెమ్మ్రోని |
| 74 | 182 | 1 | ముత్తైపుం | ముత్తైముం |
| | 183 | 2 | విటు | నిటు |
| | 1f8 | 1 | కెగ్గి | కెగ్గె |
| | 189 | 2 | విను | నిను |
| 76 | 198 | 2 | చేయుడు | చేయుదు |
| | 199 | 3 | నాడు | నాదు |
| 77 | 202 | 2 | నెల్లం | నెల్లరి |
| | | 4 | మేపె | మేసె |
| | 203 | 4 | వివ్వాల | నివ్వాల |
| | 206 | 2 | చెరి | చెలి |
| 78 | 210 | 4 | కుశలంబడిగి | కుశలంబడిగి పూజించి గో. భూ. హిరణ్యా మధుప ర్కాదికంబు లొసంగి మ్రొక్కినిల్చిన, ఋషివిరజాదులందీవించికూర్చుండ నియమించి సభాభవనంబుఁ దిలకించి వారలిట్లనిరి. |
| 79 | 215 | 2 | లెప్ప | లెస్స |
| 81 | 222 | 3 | సందు | సంద్రు |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| | 229 | 3 | గేఱి | గ్రేటి |
| 83 | 238 | 4 | యెద | యెడ |
| | 239 | 1 | నే | నీ |
| 84 | 246 | 1 | నెషా | వేషా |
| | గద్య | 3 | కాబ్జ | కాబ్బ |
| | | | తృతీయాశ్వాసము. | |
| 85 | 7 | 1 | లంపడ | లంపన |
| | | 2 | సాగమునన | సంయుతగతి |
| 87 | 18 | 1 | నెమ్మోలు | నెమ్మోయి |
| 88 | 23 | 7 | నాల | వాల |
| | 24 | 1 | పెక్కు | పొక్క |
| | 28 | 1 | నట్టాడి | నట్టిడి |
| 90 | 31 | 1 | చెవి | చెలి |
| | | 4 | జేయు | జేయ |
| | 35 | 1 | వందురుచంద్రు | వందురుచంద్రి |
| | 37 | 1 | జూచి | జాచి |
| | | 2 | జూచి | జాచి |
| 91 | 37 | 3 | దాన్నే | దివిన్నే |
| | 38 | 3 | దిన్నగ | దిన్నగను |
| | 40 | 3 | గెలు | గేలు |
| | | 4 | కనిడి | కనిరి |
| | 42 | 2 | సార్వోదర | స్వోదర |
| 92 | 43 | 2 | వారి | వాడి |
| | 44 | 3 | డెక్కొని | డెక్కొనసేను |
| | 46 | 3 | పీటు | దీటు |
| | | | మవ్వ | దువ్వ |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 93 | 48 | 3 | మూర్తి | నామూర్తి |
| | 49 | 3 | నీదు | నీరు |
| 94 | 54 | 2 | పృధా | పృదా |
| 95 | 61 | 2 | గుము | గురుండు |
| | 64 | 4 | వప్ప | తప్ప |
| | 65 | 1 | నించి | డించి |
| | 70 | 4 | దీవనల | దీవనలల |
| 96 | 74 | 6 | నిష్ట | శిష్ట్ర |
| 97 | 80 | 2 | గనిధే | గనిరా |
| 99 | 89 | 4 | కటక | కటకలలిత |
| | | 6 | హిరుణే | హారణ |
| | 90 | 8 | విండి | దిండి |
| | | 9 | కటష | కలుష |
| 100 | 192 | | ముక్తి | ముక్త |
| | | | నతాఙ్గా | నతాజా |
| | | 2 | నతాజ్యా | నతాజా |
| | | | సవా | సదా |
| | | | ఛత్ర | నాగ |
| 101 | | 3 | ప్రపంచ | అపంచ |
| 101 | 100 | 2 | కోరా | రారా |
| | 101 | 1 | ధీ | ధీశా |
| | | 8 | రాజూ | రాజా |
| 102 | 102 | 1 | బాలె | బాపె |
| | | 4 | తను | తమ |
| | 105 | 2 | షాలి | శూలి |
| | | | బోక్కి | జోక్కి |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 102 | 108 | 1 | వచ్చి | వచ్చె |
| | 109 | 1 | డంతహి | డంతహ్వా |
| 103 | 115 | 3 | మొ | మే |
| | | 4 | కాకెంకడి | కానిసిని |
| | 116 | 2 | రేకు | రేను |
| | 117 | 2 | ప్రుధజ | పుంజభ |
| | | 4 | ప్రవి | ప్రకి |
| 105 | 123 | 2 | [illegible] | పి |
| | 125 | 4 | వేచె | లేచె |
| 107 | 141 | 2 | సుకు | సుతు |
| | 143 | 1 | వి[illegible] | విభా |
| 110 | 166 | 1 | దుండ | దుంత |
| | 169 | 2 | గూర్చి | గూల్చి |
| | 170 | 2 | వెట్టిచెపు | వెట్టుచెప్రు |
| | 171 | 1 | నాధా | నాద |
| | | | చతుర్థాశ్వాసము | |
| 112 | 2 | 1 | తెలుగు | తెఱగు |
| | | | జిాద్ర | జాద్ర |
| | 5 | 2 | గాంజరి | గాంజరీ |
| | | 4 | నరూధి | వరూధి |
| 114 | 17 | 1 | కయ్యో | నయ్యో |
| | 19 | 1 | ఫుం | వుం |
| | | 2 | పషు | పక్షు |
| | 20 | 4 | కసుతె | కనువె |
| | 21 | 1 | దిగుట | దిగులు |
| 115 | 29 | 1 | గ్రక్కి | గ్రుక్కి |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 115 | 29 | 4 | ర్వహి | స్త్రహి |
| | 30 | 2 | నగం | వరం |
| | 31 | 3 | జృంభితీ | జజృంభిత |
| 116 | 37 | 4 | మ్మై | మై |
| | 45 | 3 | వారి | వాలి |
| 118 | 53 | 4 | శోభిల్ల | శోభిల్లు |
| | 54 | 1 | డేరే | డేలే |
| 119 | 59 | 5 | నుడింప | నటింప |
| 120 | 64 | 1 | చినబా | చినరాజ |
| | | 2 | చే | చి |
| | 65 | 4 | సల్వ | సల్పి |
| | 67 | 12 | శివునివిల్ విఱచి చెలగ | శివువిల్ విఱిచి చెలంగ |
| 122 | 85 | 7 | నద్య | నవ్య |
| 124 | 96 | 3 | పావృ | ప్రావృ |
| 127 | 120 | 4 | అర్కజుంషు | అర్కజుండ |
| | | | గాంచిరె | గాంచరే |
| 129 | 132 | 4 | గడవు | గరవు |
| 133 | 159 | 1 | గూడ | గూఢ |
| | 161 | 1 | నిహీన | నహీన |
| | 163 | 1 | దనువపు | దనువు |
| 134 | 165 | 2 | మేల | మేలు |
| | | 4 | భేవి | భేది |
| | 166 | పైన | దశరథులు | దాశరథులు |
| | 172 | 1 | వె | వే |
| 137 | 190 | 2 | వరకు | నరకు |
| 138 | 192 | 1 | సొన్నార | సొన్నారి |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 138 | 192 | 7 | దూల | దూర |
| 139 | 204 | 1 | యుగములలోకే | యుగములనెంతే |
| | | 2 | చోగాశికశిష్యయీవె | భూకన్యాధీశసివె |
| 140 | ;09 | 2 | గలట్టిరుపేటు | గలట్టిపేరుటు |
| | గద్య | 1 | సిరోష్ఠ్య | నిరోష్ఠ్య |
| | | 2 | కాబ్జ | కాబ్బ |
| | | | పంచమాశ్వాసము | |
| 141 | 1 | 1 | తలజ | తల్లజ |
| | | | గడిసి | గడపి |
| | 3 | 3 | జవి | జలి |
| | 5 | 1 | | వ. అంత |
| 142 | 9 | 4 | గనుచవలఱ్ | గనుచుఁజనెఱ్ |
| | 0 | 1 | | వ. ఇట్లు చనిచని |
| 143 | 16 | 3 | డప్పువి | డప్పవి |
| | 17 | 2 | మందు | మంపు |
| | 20 | 2 | రాల్చిరహి | దాలిచియు |
| 144 | 21 | 1 | మహా | మహీ |
| | 23 | 1 | గొంజరి | గౌంజరి |
| 147 | 43 | 3 | జోట | జోటి |
| | 44 | 2 | పేరా | వేరా |
| 150 | 60 | 2 | సీబందు | సేదిందు |
| | 66 | 1 | యిట్లు | యిట్టు |
| 152 | 72 | 4 | రతజ | రితజ |
| | | 8 | బిర | బర |
| | 74 | 2 | కోరి | రోరి |
| | 75 | 4 | లతంచిలె | లతంబలె |

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 153 | 80 | 2 | లనుత | లత |
| 154 | 89 | 2 | యింతేదారం | యింతేనిందారం |
| | 90 | 2 | తనుద్ధృ | తనుస్థ |
| 155 | 95 | 4 | మాయంగనయో | మాయఁగనయ్యో |
| 156 | 101 | 1 | లిహింహి | లిహింహీ |
| 157 | 107 | 12 | భంగి | భంగ |
| | 110 | 2 | దునుమాదు | దునుమాడు |
| 159 | 125 | 2 | కూదుప | కూరుప |
| 161 | 138 | 3 | సం | సు |
| 162 | 145 | 2 | మ్ముజి | మ్రజి |
| | | 3 | ల్చిమహి | ల్చిమ్రహి |
| | 146 | 2 | వసుల | వనుల |
| 163 | 152 | 4 | మహి | మహాః |
| 167 | 179 | 3 | నఘ | నఖ |
| | 180 | 2 | నంత | వంత |
| | 181 | 4 | అతిదా | అతివా |
| 171 | 209 | 1 | అవ్రుడు | అప్పుడు |
| | | 12 | సుతు చెతవి | సుతునిచేన్వి |
| 172 | 212 | 3 | డురాన | దురాన |
| 173 | 219 | 1 | ఖరకల | ఖరకర |
| 174 | 223 | 4 | గంధిదా | గంధిడా |
| | 224 | 2 | బడి | గడు |
| 178 | 246 | 2 | మధుద | మధుప |
| | | 3 | సమాఖ్య | సమాఖ్యు |
| | | 4 | డిజితా | విజితా |